శ్రీ

# మానాపమాననాటకము.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

బి. ఎల్. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జ్యేష్ఠపుత్రులగు కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.



మొదటికూర్పు.



# పీఠిక.

ఇటీవల బళ్లారి పురంబునకువచ్చిన పునాకంపినీలు రెంటిలో " కేశవ గంధర్వకంపినీ " వారు " రాక్షసీమహత్వాకాంక్ష " యను గంభీరనాటకము (**Tragedy**) నాడి ప్రేక్షకులను మెప్పించిరి. ఆనాటకమును నేనాంధ్రీకరించి పీఠికలో " ఖేదాంత" నాటకమనునది యన్వర్థనామము కాదనియును దాని పేరు "గంభీర" నాటకమనియుంపఁబడ వలెననియు వ్రాసినాను అటులనుటకుఁ గలకారణమ్ములు విస్తృతము వ్రాసినాను. మఱియొక " బాలగంధర్వ " యను కంపెనీవారు " మానాపమాన " మనెడి నాటకమాడి జనులను హర్షింపఁజేసిరి. అచటఁగూడిన రెండు వేల జనులలోఁ బదుగురికిఁదప్ప మిగతవారికి వారాడిన యొకమాటనైనను నర్థము గాదాయెను. బాలగంధర్వుఁడు పాడుచున్నపుడు మాత్రము ప్రతి ప్రేక్షకుఁడు తెలుఁగుగొడ్డుబలెఁ దలయూచుచు బాణీవాదమునఁనా వేషధారినిఁబ్రోత్సాహ పఱచుచుండెనుగాని కథయేమయ్యునదియు ననేకులకుఁ దెలియదాయెను. అట్టియవస్థచే నేనును బాధపడితిని. పిదపమహారాష్ట్రభాష నొకనెలదినములు తగినంత వఱకు నభ్యసించి ప్రారంభమున " రాక్షసీమహత్వాకాంక్ష " యనునాటకము నాంధ్రీకరించితిని. నాటకము కథారూపకముగనుండినందున నాంధ్రీకరించుపని నాకుఁగష్టమనిపింపలేదు. ఆనాటకమునందు హెచ్చుభాగము సంస్కృతశబ్దములును గొంతభాగము మనదేశములో నలవాటుగనున్నమహారాష్ట్రభాషఁ నుండెను. ఈమానాపమాన నాటకము హెచ్చుగ దేశీ భాషసంకలితము దేశీభాషయనఁగా పునాలోను నచటికిఁజుట్టుముట్టుఁగల దేశములలో గనుండు ప్రాకృతభవవికారములగు తద్భవశబ్దములు. కావున రింపనాకుఁ గష్టమాయెను. పైఁగానిది గృహకృత్యసా మైనందున ***Domestic Drama*** సాదా వారును మాటలాడురీతిగ గా ను. అయినను

నాంధ్రీకరించితిని.

[2]. ఇదిమోదాంతనాటకమని నేనుడివెదను. మోదాంతనాటకము లెటు లుద్భవించినదియు సూక్ష్మముగనిందు వ్రాయఁబూనితిని. ప్రారంభమునఁబుట్టినవి గంభీరనాటకములేను. విద్వాంసులును జదువుకొని నాగరికతగల యితరులును గంభీరనాటకములందే యాసక్తులైయుండ గ్రీసు దేశములో నిపుడు 2500 సంవత్సరముల క్రిందట థెస్పిస్సను పండితుఁడు సారాయి దైవమును (***Bacchus***) గుఱించికొన్ని యశ్లీములగు పాటలు నిర్మించి వేషధారులచే వీధి వీధిని నాడింపఁ దొడఁగెను. మోటుజనులకు మానసాహ్లాదములుగ నుండసాగెను. అట్టిజనులువాని నేకోరసాగిరి. పిదపవచ్చిన పండితులందులోని యశ్లీలము విశేషముగఁ దొలఁగించిరి. అవియే మోదాంత నాటకములాయెను. ఈమోదాంతనాటకవృక్షమునకునేక శాఖలేర్పడెను. ముఖ్యముగ (1) సంఘసాంబంధికనాటకము. [***Social drama***]

(2) గృహకృత్య సాంబంధికనాటకము ( **Domestic drama** )

" షేక్సిపియ " ఁరుకాలమున గంభీరనాటకము లెటుతలయెత్తెనో యదేరీతిగ " బెన్‌జాన్సన్ " యనుకవి మోదాంత నాటకములకుఁ గలశమెత్తెను. ఈవిషయము నాచే వ్రాయఁబడిన " ***The Dramatic History of the World*** " చూడనగును.

[3]. యూరోపియన్ భాషలలోఁ జేరందిన మోదాంత నాటకములు నేఁ జదివినాను. వానిలో దేనికిని నీ " మానాపమాన " నాటకము కాదు. అచట నచట నన్నెహెచ్చింపఁజేసినదనియే నాతాత్పర్యము. "***Th Rivals***" "***The School of Scandle***" ...గా మతిరమ్యమని పండితులతాత్పర్యము. ప్రస్తుత

...కు. గావున నాం

ధ నాటక కవులెవరును నాపైఁగినుక వహింపవలదు. ఆంధ్ర నాటక కవులనేకులు తామువ్రాసిన నాటకములు తామే చదివి మెచ్చుచుఁ దమ కాళ్లకుఁదామే నమస్కరించికొని శతాయువని దీవించికొనువారుగ నున్నవారు. ఇతర దేశస్థుల గ్రంథములను జూడరు చదువరు. అందులోనుండు స్వారస్యమును గ్రహింపరు. అటువలెనే తామొనరింపయత్నింపరు. ఇట్టులైన నాటకభాషాభివృద్ధి యెటులగును? గంభీరనాటకములలో భాషయెటులుండవలెను మోదాంతనాటక భాషయెటులుండవలెనను తారతమ్యమెటు దెలియవచ్చును?

[5]. శౌర్యముస్తుత్యమా ద్రవ్యముస్తుత్యమా యనువిషయమే యితివృత్తమునకు బీజముగనుంచికొని యింతటిమోదాంతనాటకమును గష్టపడి రచించి కీర్తినిఁగాంచి యితరులకు మార్గదర్శకులైన మ॥ రా॥ రా॥ శ్రీ. కృష్ణాజి ప్రభాకర్ ఖాడీల్కరుగారికి నావందనములర్పించుచు నింతటితో నీయుపోద్ఘాతమును ముగించు.

బళ్లారి
30-10-16

విధేయుఁడు.
కోలాచలం శ్రీనివాసరావు.

# THE DRAMA "MANAPAMANA" ARGUMENT.



## ACT I.

Bhamini the Heroine makes up her mind to marry only a scion of a rich noble family, (a Srimanth) although it is her father's intention that she should marry the Hero, the valiant but poor Dhyryadhar, the Commander.

This desire of Bhamini is fully supported and encouraged by her elder sister Akkasaheba.

Akka's husband Vilasdhar a Jahagirdar plans the idea of noble Bhamini to think favourably of marrying his friend the rich king Lakshmidhar a boastful cowardly fool instead ofthe valiant Comamander Dhyryadhar.

Bhamini's father Baba Sahib anxious of guarding her well-fare, intends to marry her to Dhyryadhar and sends for him for the marriage from the Cantonment. Dhyryadhar comes in response to the invitation but Bhamini insults him by refusing to marry him.

## ACT II.

Baba Sahib resents this indirect action of Bhamini and seriously advises her to regain the hand of Dhyryadhar by living and moving about Dhyryadhar's camp for some time. Accordingly Bhamini under the name of " Vanamala " lives incognito as a poor girl in the bungalow of her friend Kusuma, close by the Cantonment. These circumstances are narrated to Vilasdhar by his servant Vinoda.

In her ramblings in the camp Bhamini was hearing constantly the talk of the greatness and bravery of Dhyryadhar, with the result that

her attention was drawn only towards courage, bravery and such like qualities and her inclination to-wards high birth and riches began to wane. On this Vilasdhar tries to make Lakshmidhar a valourous man.

Dhyryadhar and Bhamini (Vanamala) meet for the first time and love is kindled in them both.

Vilasdhar's plan becomes frustrated owing to the ridiculous mock valour of Lakshmidhar.

Dhyryadhar rescues Bhamini (Vanamala) from the clutches of thieves which greatly augments her love towards valour and chivalry.

ACT III.

Vilasdhar finding his plan frustrated instigates his wife to coerce Baba Sahib to get Bhamini married to Lakshmidhar.

Lakshmidhar's jestful soliloquy on the coquettry and jewellery of Srimanths.

Bhamini discusses her love towards Dhyryadhar with Kusuma. The Commander Dhyryadhar having returned victorious in the battle is rewarded with a Jahagir and proceeds to meet BabaSahib. Baba Sahib requests Dhyryadhar to forget the insult given to him by Bhamini and forgive her by marrying her. But Dhyryadhar discards the request by expressing his unwillingness to marry Bhamini and declares his determination of marrying only a poor but accomplished girl and departs.

The determination of Dhyryadhar scatters all hopes of Bhamini. She determines to remain incognito again as the poor girl Vanamala and thus win the love of Dhyryadhar.

ACT IV.

Vanamala enters the service of Dhyryadhar as a servant girl. She feels that Dhyryadhar has begun to love her and desires to put it to test. With this object she gives leave to all the servants of Dhyryadhar and sends them away.

Dhyryadhar and Vanamala express love towards each other.

But still the intention of the jealous Vilasdhar was to see Bhamini married only to Lakshmidhar his friend. So Lakshmidhar and Vilasdhar conspire to estrange the love of Dhyryadhar towards Vanamala.

## ACT V.

The poor Vanamala reveals herself to be the high bred and noble Bhamini and garlands Dhyryadhar in token of love.

Dhyryadhar accepts her hand in marriage.

## MANGALAM.

## *Dramatic Personae.*

Dhyryadhar:—The Commander of forces.

Babasahib:—Bhamini's father - Srimanth - Jahagirdar.

Laxmidhar:—A rich noble and boasting Jahagirdar, and Dhyryadhar's rival for the hand of Bhamini.

Vilasadhar:—Akka's husband.

Vinoda:—Servant.

Bhamini:—The daughter of Babasahib - A Srimanth and Jahgirdar.

Vanamala:—Bhamini's assumed name as a poor girl.

Kusuma:—Bhamini's friend.

Akkasahiba or Akka - The elder sister of Bhamini.

### పురుషపాత్రలు

ధైర్యధర:— సేనాధిపతి

లక్ష్మీధర:— ఒకగొప్ప జాగీరుదారుడు. ధైర్యధరుని ద్వేషి. భామినిని మోహించియుండెను.

విలాసధర:— అక్కభర్త

బాబాసాబు:— భామినితండ్రి. శ్రీమంతకుటుంబమునకు చేరినగొప్పజాగీరుదారుడు.

వినోద:— సేవకుడు

శీలధర:— ధైర్యధరునిస్నేహితుడు. సేనకుచేరినవాడు.

### స్త్రీపాత్రలు.

అక్కాసాబు:— భామినిఅక్క.

భామిని (వనమాల):— యనిఒకబీదదానివలె పేరుపెట్టుకొనియుండెను. బాబాసాబుకూతురు.

కుసుమ:— భామినిచెలికత్తె.

కమల:— చెలికత్తె.




# మానాపమాననాటకము.

## నాంది - సూత్రధారుఁడు - పారిపార్శ్వకుఁడు.

సూత్ర:--చం. నటవర సూత్రధార నటనాట్యవినోదకరా, చిదంబరా,
కుటిలనిశాటవంశవనకోటికుఠార, భుజంగహార సం
కటపరిహార, శూలధర, కమ్రశరీర, శివంకరా, హరా,
పటుతరసంయమీశ్వర, శుభమ్ములఁబ్రోవర ప్రేక్షకాళినిన్.

ఉ. మోదముఁ బ్రేమతో నొసఁగి ముజ్జగముల్మనఁ జూచి, కావరా,
ఖేదములెల్లవారియెడఁ గీటడఁగింపర; మానసంబునన్,
బాదుగనిల్చి నీనుతులఁ బాడఁగఁ జేయర, పార్వతీశ్వరా,
మేదురమౌశుభమ్ములను, మేధయు, నాయువు నిచ్చి ప్రోవరా.

సూత్ర:— పారిపార్శ్వకా! పరమేశ్వరుని ధ్యానమిఁతయ, చాలును. ఈ పూజాపాత్రలను లోనికిఁ దీసికొనిపోయిపెట్టి దానిని నిచ్చటికిఁ బంపుము.

పారిపా:— మహారాజా! నాటకప్రారంభమున మీరెప్పుడును నిట్టియాజ్ఞలిత్తురు. సుజ్ఞుఁడను తమసేవకుఁడు తమకు నావిషయమున మఱలఁ బలుకుశ్రమ పలుమాఱియ్యఁగూడదనియెంచి నేనిచటికి వచ్చుసమయముననే, యమ్మగారినిఁ జూచి "అమ్మగారూ! ఈశస్తవనము ముగిసియుం ముగియక మునుపే మీరిచటికివచ్చు ప్రయత్నముసేయుఁడీ" యని విన్నవించితిని.

సూత్ర:— బాగుచేసితివి. నేఁడుత్వరపడుటయ మంచిది. ప్రారంభముననే నీవుత్వరపడినది మేలాయెను. అయినను నదియింకను రాకయున్నదేమో కదా?

పారిపా:— వారురారని నాకుఁ దోఁచుచున్నది. అమ్మగారప్పటినుండియు సొమ్ములకుఁగాను గోపమున నున్నవారు. నేనువినయముగఁ బ్రార్థించినపుడు వారు చెప్పినదేమన.

(యవనికలో:— నేనురాను. రానని ఖండితముగఁ జెప్పుచున్నాను)

సూత్ర:— నిజము. అదినిండు కోపనగఁ దోఁచుచున్నది. నేనేపోయి దానినిఁ బ్రార్థింపకయున్న దాని కోపమునకు శాంతిగలుగదు.

(నిష్క్రమింతురు.)

( మహిషాసురమర్దనీ దేవాలయము. భామిని, కుసుమ ప్రవేశము )

భామిని:— నేనురాను. రానని ఖండితముగఁ జెప్పుచున్నాను. ఇదియేమే, కుసుమా నీనవ్వులాటలు? నేనచటికిరానని చెప్పినను మఱల రారమ్మని నీవునన్ను బాధించుచున్నావు.

**కుసుమ:—** భామినీ! నీవేలయిటులఁ జేయుచున్నావే? ఆలస్యము కదా యేమి? అదె చూడుము సూర్యుఁడస్తాద్రికిఁ జనెను. బాబాసాహేబుగారు చెప్పిరి గదా "దీపముంచియు నంటింపక మున్ను సేనాపతియైన ధైర్యధరుగారు ఉత్సవముతో నిచటికి వచ్చెదరు. అంతకుఁ బూర్వమే భామినిని, శోభించులాగు సింగరించుకొని సిద్ధపడియుండు లాగునఁ జేయుము" అని తెలిపియుండిరి. ఏమే, నీకు ధైర్యధరునితో లగ్నమగును. పెండ్లికొడుకు వచ్చు సమయమున నీకిటు కినుక వహించితివి! నీకీనడత శోభించునా?

**భామిని:—** శోభింపకున్న నేమాయెను? ధైర్యధరుఁడు పరాక్రమవంతుఁడైనను, సేనాపతియైనను, నా తండ్రికంటెను దరిద్రుఁడు కాఁడా? వట్టిపరాక్రమము పైననే యాఁడువారి మనము నిలుచునా? మానసాపేక్షను బూర్ణీకరించు నన్నినగలు జేయు పెండ్లికొడుకును నాఁడువారు ప్రేమింతురు. ఆదిక్కునఁ జూడుమా రజనిని పరాక్రమవంతుఁడైన సూర్యునిని. ఆసూర్యుఁడు రక్తుఁడయిన కారణంబున, నారజని వానిని దూరము ద్రోయుచున్నది.

చ. అదెగను, సూర్యుఁడస్తగిరి యావలఁ బోయెనిరస్తతేజుఁడై,
సుదతిసురక్తయై రజని సూర్యునిఁ జూడక తారహారసం
పదముదితన్ క్షపాకరుని, సంగతి సౌఖ్యములందఁ గాంచెడిన్
మదిఁగనునీవు; మానినికి మాన్యుఁడు భర్తయెవండో నెమ్మదిన్.

చేలీ! ఆధైర్యధరుఁడు రానిమ్ము. ఆసూర్యుని గతియె వానికిని వచ్చులాగొనరింపక నేనుండఁ బో ననుగాను.

**కుసుమ:—** భామినీ! ఇట్టి పిచ్చిమాటలాడకు. నా భామిని సంపూర్ణాజ్ఞాధారకయని బాబాసాహేబుగారు సర్వకాలములందును నిన్ను మెచ్చుచుందురు. పద యవతలనుండు మందిరములోనికిం మేనునిండ సొమ్ములు ధరింపుము. పెండ్లికొడుకిచటికి వచ్చునంతలోఁ బెండ్లికూఁతు రలంకరించికొని లక్ష్మీదేవివలె నుండవలెను. పెండ్లికొడుకు వచ్చినపిదప, మహిషాసురమర్దనీప్రసాదము నీవు వానిచేతిలో నిడవలెను ఇదియె, కులాచారము. బాబాసాహేబుగారు వచ్చి నీవీరీతి గనుండునది చూచినచోఁ గోపగింపరాయేమి?

**భామిని:—** తండ్రిగారి భయము నాకు హెచ్చుగఁ జూపవలసినదేమి యులేదు. నేఁడుదయముననే తండ్రిగారికి నేనంతయును దెలిపినాను. నేనిపుడు ధైర్యధరునిఁ బెండ్లియాడను. ఏమే, అట్టిదరిద్రుని నెవతె పెండ్లిచేసికొనును.

గీ. నిర్ధనునిఁ బెండ్లియాడిన నెలఁతయెందు
నాత్మహత్యయ కావించి నట్టిదగును
మానసానంద మగునెటు హీనభాగ్యుఁ
బతిఁగఁ గలదాని కిలను దుర్గతియ గాదె?

ఇదె చూడు కుసుమా! నాయన్న కోపగింపనీ, మఱెవ్వరేమయిన నననీ నేనేమో యాదరిద్ర ధైర్యధరుని బెండ్లియాడను.

కుసుమ:---చెలీభామినీ! ఇంచుక యాలోచింపుము. నీవు శ్రీమంతుని సుతయైన మాత్రముననే నిన్నులక్ష్మీపుత్రుని యింటికి నియ్యవలె ననునది యెచటను లేదు.

భామిని:—ఎందుకు లేదు? నాయన్న నన్ను శ్రీమంతుఁడగు వరునకు నియ్యక తప్పదు.

కుసుమ:—చెలీ! ఉత్తరాధిపునితో యుద్ధమొనర్ప మన పృథ్వీవరమహారాజు కొందఱిని సేనానాయకులను బంపఁడాయేమి? పరాజితులై వారందఱుఁ దిరిగి రారాయేమి? యింతవఱకు ధైర్యధరుఁడే తన పరాక్రమమున నిపుడు రెండు మాసములలో నుత్తరాధిపుని వెనుకపోవులాగొనరించెను. లగ్నకార్యమునుగుఱించి యిపుడించుక యవకాశము చేసికొనియున్నాడు. ఏవీరుని, జయశ్రీవరియించి రణభూమిపైఁ బుష్పమాలవేసినదియో, యావీరునకు నినుఁబోలినయుత్తమకన్య, లగ్నమంటపమునఁ బుష్పహారము వేయవలెనని పూర్వాచారమున్నదనుటకు నుదాహరణము లున్నవి.

భామిని:—ఉండనిలేవే నీ యుదాహరణములు. ఈభామిని యితరుల యుదాహరణములరీతిగ నాచరించునది కాదు. నావర్తనయే, పైబంతిగ నుంచికొని యితరులు నేర్చికొనవలెనని నేనుజన్మమెత్తినాను తెలిసెనా?

కుసుమ:—స్వయంవరములలోఁ బణముంచి శౌర్యపరిక్ష చేసినపిదప, సీతాద్రౌపదులనుఁబోలు రాజకన్యలనిచ్చి లగ్నములు చేయఁబడినవి. అవియేమియును నీకుఁ దెలియవు కాఁబోలు?

భామిని:—అవునవును. తెలియును తెలియును. స్వయంవర సమయమున, వట్టిపరాక్రమముపై విశ్వాసముంచిన సీతాద్రౌపదులేమి బుద్ధికౌశల్యమును జూపిరో నాకుఁ దెలియక యున్నది.

చ. అవనిజ, యీశువిల్లుఁ దునుమాడిన వాఁడిమిఁ జూచి మెచ్చి, రా
ఘవుని వరించి కాంచెఁగద కాననదుఃఖము హెచ్చుగాను, పాం
డవుల వరించి ద్రౌపది వనంబునఁ జెందెనుగాదె కష్టముల్
ధవుఁడు దరిద్రుఁడైన నెటుదక్కు సుఖానుభవంబు నాతికిన్.

కుసుమ:—భామినీ, నేనెంతగఁ జెప్పినను నీకుఁ దెలియక యున్నది. అదిక్కునఁ జూడుము, అక్కగారు వచ్చుచున్నారు. కమసలవాఁడు చెవులుకుట్టినఁదప్ప.........

భామిని:—అక్కరాని గాక, యబ్బరానీ; ఎవరు చెప్పినను నేను వినను. అక్క పెండ్లియును గాదిది అబ్బ పెండ్లియును గాదిది. పెండ్లికాఁదగినది నాది.

( ప్రవేశము. అక్క, చంప, మాలతి, వినోదులు ప్రవేశింతురు. )

అక్క:— బాగాయెను. భామినీ! ఇంకను నిచటనే యున్నావా? నీవలంకరించికొని యెపుడే యాదిక్కుననుండు మందిరంబున నున్నావని తెలిసి యుంటిని. ధైర్యధరుఁడిపుడే యిచ్చటికి వచ్చునట్టుగనున్నది. ఇదియేమే కుసుమా! భామిని మేనుపై నేయలంకారములును లేవు? ఏమియిది?

వినోద:— పేదరాలగు పాఠము, మనపిల్ల, యిప్పటినుండియ నేర్చికొనుచు నున్నలాగు తోఁచుచున్న

యది. అక్కగారూ! పుట్టినింటిలోఁ జేదబలెఁ జింపుడు బట్టలుఁగట్ట నభ్యసించినఁగదా యత్తగారింటి దారిద్ర్యము బాధింపక యుండును.

చంప:— చేలీ భామినీ! దరిద్రురాలుగా నుండఁబోవుదునను భీతిచే నగలుధరింపకయుండు నీవింతటి వెలఁజేయు చీరయేల కట్టితివి?

మాలతి:— ధైర్యధరుని యింటిలో సాధారణమగు చీరఁగట్టవలసివచ్చును, పుట్టినింటిలోఁ జింపుడుగుడ్డలు గట్టికొనినఁదప్ప నత్తగారు గృహప్రవేశ కాలముననిచ్చుచీరఁ గట్టి భామినినే ధన్యనైతినని తెలియవలదా?

చంప:— బాగాయెను భామినీ: చింపుడు గుడ్డలుకట్టు పాఠమిప్పటినుండియు నేర్చుచున్నావుగదా? మేలాయెను.

వినో:— పెండ్లికొడుకు దారిద్ర్యముయొక్క మొదటిచాయ, సొమ్ములమీదఁ బడినది. తండ్రిగారి యాశ్రయమువదలి, భామినియెపుడు దరిద్రభర్త గుడిసెఁజేరునో, యప్పుడేవాని యింటివ స్త్రపాత్రలపైనా చాయపడక యుండదు. శ్రీమంతత్వముపోయి దారిద్ర్యమెప్పుడు వచ్చునో యప్పుడే ప్రథమమున, నగలుపోవును. పిదప భద్రముగ దాఁచియుంచిగొప్ప చీరల జలతారుకొంగులు విక్రయింప వలసివచ్చును. వెలికివెడలు లక్ష్మీదేవి యడుగు లీరీతిగజరుగుచుండును.

అక్క:— నిజమిది చెల్లెలా! ఆదరిద్రుఁడు ధైర్యధరుఁడు నీకెటులభించె ననునది నేవిచారింప వలసినదిగనున్నది. అమ్మా! ఇదిరయేమో యాశ్చర్యముగ నున్నది. నావివాహ కాలమున మనయిరువురి పెండ్లియుఁ గావలెనని లక్ష్మీధరుఁడను జహగీరు దారునకు నినియ్యవలెనని నిర్ధరింపఁబడి యుండెను.

చంప:— అకాలమునం దక్కగారి మగనియంతటి శ్రీమంతుఁడు లక్ష్మీధరుఁడు కాఁడని భామిని కోపగించిన కారణంబున నాపెండ్లినిలిచి పోయెను.

వినోద:— అక్కగారి భర్తయగు విలాసధరుని వచ్చుబడి యిఱువదియైదు లక్షలు. లక్ష్మీధరుని యుత్పత్తి యిఱువది నాల్గులక్షలు. తారతమ్యమొక లక్షగనుండెను. ఈలక్ష తారతమ్యము భామిని సహింపదాయెను. ఇపుడో ధైర్య ధరునకునడవిలోఁ బొలములేదు. ఊరులోనిల్లులేదు. అట్టివాని కంఠమున మాలవేసి, ప్రతిసంవత్సరము వచ్చునిఱువది నాల్గులక్షల నష్టమెటుల సహించునోకదా! నేనునిజముగఁ జెప్పుచున్నాను, అక్కచెల్లెండ్ర మధ్యనిరువదియైదు లక్షలయంతరమనునది ననుఁబోలు నిఱుపేదకు సహితము సహింపులేదు.

మాలతి:— ఏమిభామినీ! అటులమోముఁ ద్రిప్పితివి? నీపతిరాజుగారియుత్పత్తి యెన్నిలక్షలైనదియుఁ జెలుపుము. ఈవినోదుని నోరుమూయింపుము.

భామిని:— ఏమీ? ఏవరికిఁ బలివాఁడని పలికెదవే? ఆ ధైర్యధరుని నే వివాహమాడుదునని తలంచితివియా? ఆ దరిద్రుఁడగు ధైర్యధరునితోనే వివాహమాడనని నేఁ బ్రారంభముననే పలుకలేదా? అటులుండియును మఱియు నీవా ధైర్యధరుఁడు నాపతిరాజని యెప్పుడును పల్లవి

పాడుచున్నావేల? నేఁడుదయమున నాయన్నగారికి నేమి తెలిపితినో దానినే మఱల మఱల నీకు నక్కగారికిని దెలిపెద.

మ. ధని నేనైన యథనాథునుఁ బతిగఁ జేఁతఁగా నైఁతునే? నిర్ధనుం
డును నెందుఁ నిధనుండు కాఁడె భువి? వాఁడుఁ మానినీ మానసం
బునకుఁ మెప్పుగ నిల్చునే? కడిమిదా భూషించునే కాంతకుఁ
ఘనశ్రీమంతుని భర్తగాఁగొనుచు సౌఖ్యంబందగాఁ బొందగుఁ.

( వెళ్లును )

కుసుమ:—ఇదియేమే యది యటులఁ గోపమున వెళ్లిపోయెను? నా యన్నగారు నాకీవిధముగఁ దెలిపి యుండిరి కదా, ధైర్యధరుఁడెప్పుడు దేవీదర్శనమునకు వచ్చునో యప్పుడు భామినిని, దేవీ ప్రసాదమని దేవిపైనున్న పూలమాల ధైర్యధరుని హస్తమం దిడఁజేయింపుఁడని

అక్క:— నిజము. అదియ, మా కులాచారము. నా లగ్నమందు నైత మీ మహిషాసుర మర్దనీ మందిరములో సీమంత పూజా సమారంభమాయెను. అత్తఱి, దేవీదర్శనమునకు, వారువచ్చిరి. అప్పుడు ప్రసాదమని నేను పుష్పహారమును వారియొక్క చేతిలో నుంచితిని. అది యటులుండని. ఏమే కుసుమా! నేఁడు ధైర్యధరుగారి సీమంతపూజ కానీ, కాకపోనీ, భామిని యిచటికి నెటులవచ్చును?

కుసుమ:—సీమంతపూజ యుదయమున నున్నది. పెండ్లికొడుకు మననగరముఁ జేరి గుఱ్ఱము దిగినవెంటనే యతఁడు ప్రథమమున మహిషాసుర మర్దనీ దర్శనము చేయవలెను. అటుల ధైర్యధరుఁడు నిర్ధరించినాడు. ప్రథమ దర్శన కాలమునఁ బ్రసాదమిచ్చు నెపమునఁ జలిపత్నులొకరి నొకరుఁ జూచుటకై బావాగారీ దినముననే మనభామిని ప్రసాదమియ్యవలెనని నాతోఁ జెప్పినారు. ( పరదాలోఁ గొమ్ములూదఁబడును. ) అమ్మమ్మ!! ధైర్యధరుగారు వచ్చిరి కాఁబోలు? అక్కగారూ! మీరిదివఱకు భామినితో నొనర్చిన నవ్వులాటలు ముగిసెను. ఇపుడు నా వెంటరండు. భామినిని సమాధాన పఱచి దేవీసమీపమునకుఁ బిలిచికొనివచ్చి నిలుచునటులఁ జేయవలదా?

అక్క:— చెలీ కుసుమా! అచ్చటికినీవేపొమ్ము. భామిని నామాటలు విను లాగొరించుట నావలనఁగాదు. నేఁబిలికినచో నదిహెచ్చుగఁ గోపమువహించును.

మాలవి:—కుసుమా! దానిని సమాధాన పఱచుటకు నీవే వెళ్లుము.

వినోద:— భామినిని ధైర్యధరునకునిచ్చి పెండ్లిచేయుట యక్కగారికి నిచ్ఛయుండినటుల తోఁపదు. కావునదాని నేల సమాధాన పఱుతురు. భామిని సరసకు వారువచ్చి సమాధానము సేయుటకంటెను, ధైర్యధరుని నిచ్చటినుండి యుద్ధశిబిరము చేరఁబొమ్మని చెప్పుట మంచిదికాదా యేమి?

కుసుమ:— భామినీలగ్నము విఱువవలెనని యక్కగారిచ్ఛయించినటులున్నది. లగ్నమంటపము కట్టఁబడినది. పెండ్లికొడుకు వచ్చినాఁడు. అయినను లగ్నము కాలేదనిన బాబాసాబుగారు వెలికిమోముఁ జూపఁగలరా?

అక్క:— ఆ దేవమంటపములో నదేముహూర్తమున భామినిలగ్నమగునని, కుసుమా, తెలియుము. నేని పుడు బాహాటముగఁ బలికెదను. అవికారి ధైర్యధరునకును భామినికిని లగ్నమగుపని లేదు. ఇంతగనన్నేల కష్టపెట్టెదవు?

కుసుమ:—రెండవ పెండ్లికొడుకు నప్పుడే వెదకి పెట్టినారా యేమి?

చంప:— వెదుకనేల. లక్ష్మీధరుఁడు మనవిలాస ధరునితో వచ్చును.

మాలతి:—ఒకలక్ష యుత్పత్తి తక్కువయని పూర్వము విఱిగినలగ్న మదేమంటపమున నిపుడు చేసిన ముగిసెనుగదా?

అక్క:— ఆదరిద్ర ధైర్యధరుఁ డూరక పెండ్లికొడుకు నామమున నిలుచును. ఆ యాగంతవుని మెడ నుంచి వెలికిఁ బాఱవైచినాఁడు దోడ్పడుదువుకదా కుసుమా?

వినోద:— ఇప్పటికాలము నేనుగుర్తించుచున్నాను. ఎచ్చటెచ్చటను బ్రతిష్ఠావంతు లాగంతకులై యధికముగ వచ్చుచున్నారు. రెండునాలుక లాడుచుండినచో మూఁడవనాలుక సిద్ధముగనుండును. రెండుకన్నులు చూచుచుండినచో మూఁడవకన్ను, పిలువనిదే వచ్చినిల్చియుండునని తెలియుము. రెండుపీనులు సమీపించినచో నొడ్డనైక యాగంతకునిబలె మూఁడవపీను మధ్యనదూర్చును. అక్కగారు! ఆ, ఆగంతకులరాక యూటంక పఱచుట యత్యావశ్యకము. కుసుమా! అప్పుని నీవానరించి, నాబలెనే యక్కగారికి సాహాయ్య పడుదువని తెలిసినాను.

కుసుమ:—నేను సాహాయ్యపడుదానను గాను. నేనిటులనేపోయి, భామినికీరీతిఁ దెలిపెదను. లక్ష్మీధరుని గోచిపట్టు కొనితిరుగువారు కొందఱు ధైర్యధరుని నిందించుచున్నారు. సకలమును నీవు చక్కఁగఁ దెలిసికొని దేవప్రసాదము వానిచేతిలో నుంచితివేని వారిముఖ భంగమగును.

(వెళ్లును)

అక్క:— వినోదా! నీవును దానివెంటనే పొమ్మ. మఱియు ధైర్యధరుని నెటునిందింప వలెనసిన భామినీ మనమువానిపై బొత్తిగవిఱిగి పోవలెను. అటులొనరింపుము.

వినో:— అక్కగారూ! మీరుసిర్భీతిగనుండుఁడి. ధైర్యధరుని నేను యథేచ్ఛగ నిందించెదను. వాని యింటి యన్నము నేనెపుడు నపేక్షింపను చూచెదను. నిజమిది. నాయెదుటఁ గుసుమ యేమి సేయునో?

(వెళ్లును)

అక్క:— మాలతీ! ఈలగ్నమెటులయిన నటంకపఱచియ తీరవలెను. ఈదరిద్రునింట నాచెల్లెలు సుఖపడునని నాకుఁదోఁపదు. లక్ష్మీధరుఁడు మాయంతటి శ్రీమంతుఁడుకాఁడు నిజము. అయినను నిరువదినాల్గు లక్షలుత్పన్నముఁ గలవారిక్కాలమున నెవరుగలరు?

మాలతి:—విలాసధరుగారు వచ్చుచున్నారటు చూడుము.

చంప:— వారివెంటనే లక్ష్మీధరుఁడు వచ్చుచున్నాఁడు.

అక్క:— లక్ష్మీధరునింబోలు రాజపిండము మనభామినినిఁ గలయవలెను.

( విలాసధర లక్ష్మీధరుల ప్రవేశము )

లక్ష్మీధ:—లేదుతండ్రీ ఇట్టి వికారి పెండ్లికొడుకును నెచ్చటను జన్మాదినుండి కనముచూడలేదు. విలాసధ

రగారూ! ఆదరిద్రుఁడు మీపద్ధకుఁడు కావలెనని వాఁడుకోరి యుండెను. అటులైనను మముఁబోలు శ్రీమంతులు మీతో నెటు కలసిమెలసి యుండవలె ననుశంకనామనమునఁ గలిగినది?

విలాస:— అవునబ్బా: అటులైనది నిజమేరు. ఆదరిద్రునివెంట పీనులగుండ నేను నడుచునపుడు నాకుఁ దలవంపులుగ నుండెను.

లక్ష్మీధ:— ఆదరిద్ర ధైర్యధరుఁడు వెలుపట సేనాపతిగనుండినను నింటపీఠస్థకుఁడేను. అడకత్తియొక్క రెండాకుల మధ్యన నీటికిరాని యున్నాడు. సేనాధిపతి సంబంధమున మముఁబోలు శ్రీమంతు లడుగడుగునకు నాదరిద్రునుండి యవమాన పడవలెనునది చాలుఁజాలు. నేనునీబతె బాబాసాహుగారి యల్లుఁడయి యుండినచో ఖండితముగ నాక్షేపించు చుంటిని. అంతటి ప్రసంగము తటస్థించినచో నొకటిద్దను గాధిగావు రుండినను వారినొకటే తూరిగఁ బెండ్లిచేసికొను చుంటిని. ఆదరిద్రుని పేడమీయింటవలదు. విలాసధరగారూ! మిముఁబోలు శ్రీమంతుల కు విట్టికళంకమంటినచో దానినెటు తొలఁగింతురో తెలుపుఁడి వినియెద.

విలాస:— వింటివియా, యేసేరీచెల్లెలు ధైర్యధరునితో వివాహమాడునని పట్టణము వాడండయును వినినంతటి నుండి ప్రతియొక శ్రీమంతుఁడును నన్నీరితి నిందింపఁ బ్రారంభించివారు. లక్ష్మీధరగారూ! ఈకళంకము శాశ్వతముగ నిలుచు ననుభీతి నాకుఁ గలుగుచున్నది.

అక్క:— ఈ విషయమున మీకేమియు ననవలదు. నేపందటియూలకమునను భామినిమనమువానిపై విలుగులాగొనరించినాను. నేఁడో, రేపో మఱునాఁడో భామిని దేవీప్రసాదమిచ్చునప్పుడు వానికే మోయియ్యవని ఖండితముగఁ దెలియుఁడి. ఆ ముహూర్తముమాత్రము వ్యర్థము కాదని తెలియుఁడి.

విలాస:— ముహూర్తము రిత్తపోదనిన యర్థమేమి? లక్ష్మీపుత్రుఁడగు లక్ష్మీధరుని నా చేళలో ధైర్యధరుని స్థానమునఁ బెండ్లియఱుఁగు పైనిలుపవలెననియా? లక్ష్మీధరగారూ! అదేకదా దాని యర్థము.

లక్ష్మీ:— నేనెదుట నిలిచినచో నెవరినుండియును నెచటను నేయటంకముఁ గలుగనీయను. ఏమండీ! అట్టి ప్రసంగము వచ్చెనేని, నే నొకరినిగా దిరువురు ముగ్గురినైన నొక్కతూరిగఁ బెండ్లియాడ సిద్ధుఁడుగ నుండెదను. ఇవ్వార్త మీకుఁ బ్రారంభముననే నేను దెలిపినానుగదా? ఆ దరిద్రుని గర్వము విఱుచుటకుగాను మీ యందటి యాగ్రహము మున్నువలె నుండినయెడల మీ యిష్టము నేను వ్యర్థము సేయను. అటు లేనివాఁడు శ్రీమంతులలో నేనెటు శ్రేష్ఠుఁడ నగుదును? వెనుకద్రొక్కువాఁడనుగాను. మీరేమి చింతింపకుఁడి. విలాసధరగారూ! మిమ్ములను నన్ను మఱియు నితర లక్ష్మీపుత్రులను నా వికారి ధైర్యధరుని యుద్ధరీతిగ రణాంగణంబున నడుచుకొనవలెనని మన పృథ్వీవర మహారాజుగా రుత్తరువుచేసినపుడు, మనమెవరైన నేమిపనిఁ జేసినను వాని నవమాన పఱచుచుండవలెనని మనమందఱము మాటలాడికొని యుండలేదా? మీరు కొందఱు వలదు వలదని పలికినను పరకునేయక మీ కందఱికిని నేను మార్గదర్శియై నిలువలేదా? ఊఱక యటులైలినా? చూడుఁడి చేసెదను. నేటినుండియు

వానికి నవమానము చేయుచుండెడ. చెప్పదను చూడుఁడి. నా శరీరముపైనుండు భూషణ ములమూలకమున వానికి నేఁడైన యవమానము గుత్తించిలిరా?

విలాస:— అవునండి, ఎంతటి యపమానమది? మంచి యవమానమది.

చంప:— నేఁడా శవమునకు మంచి యవమాన మాయెను.

విలాస:— వాఁడించుక బుద్ధిశాలి యైనచో నేటి యపమాన మెఱింగి తనంతటఁ దానే లగ్నముపై నాశ వదలవలెను.

లక్ష్మి:— ఊరేగింపు సమయమున వాఁడు నా శరీరభూషణములు ప్రారంభమునఁ జూచినంతటనే తన ముఖముఁ ద్రిప్పికొనెను. ఇంతటి యపమానమైనపిదప వాఁడచ్చటనుండియే మరలిపోవునని నేఁ దెలిసితిని. వాఁడు మంచి యారితేఱిన మొండిగ నున్నవాఁడు. నే నూరేగింపు సమయ మునఁ బ్రాముఖ్యుఁడనై ముందు నడుచుచుండ నా నీడయుంబోలె వెనుక వెనుక వాఁడు వచ్చుచుండెను.

అక్క:— ఆ శవమునకు నేఁడింతటి యవమాన మాయెనా?

విలాస:— అవమానమని యేల విచారించెదవు? లక్ష్మీనరుగారి శరీరభూషణములును వారి శ్రీమంత తన మును నీవు చూచియుండినచో నీకే తెలియుచుండెను. భూరి లావణ్యాసుగల ముత్యాసు లును, మఱలఁ జక్కఁగ నేఁటితెచ్చిన నిష్కళంకమగు వజ్రములను నే లక్ష్మీపుత్రునివద్దను లేవు. అట్టి ముత్యముల మూర్తియగు విగ్రహము సముముగ, ధూళి ధూసరితమైన బొమ్మ వచ్చుచుండ, నవమాన మెంతయుండునో?

లక్ష్మి:— నా యంగభూషణములను జూచి సర్వులు నేనే పెండ్లికొడుకని తెలిసికొనిరి. ఒకరిద్దఱు నా దిక్కునే వ్రేలుఁజూపుచుఁ బెండ్లికొడు కితఁడేనాయని హైర్యధరునినే యడిగిరి? ఇంతటి యపమాన మొనర్చితిని. భళి భళీ! - ఇంతటి యవమానమంది హైర్యధరుఁడు తలవంచియు వంపకయుండ, గుంపులోనున్న యొకస్త్రీ, వానిదిక్కు వ్రేలుచూపి, పెండ్లికొడు కింతటి బికారినేవకుఁడా? ఇట్టివాఁడెచటనుండి వచ్చెను? అని విసఁబుసులాగు పలికెను. ఇంకను వానికిఁ గాఁదగిన యవమాన మేమున్నది?

అక్క:— బాగాయెను. ఊరేగింపుమున్నే వానికి గొప్పయవమానమైనది బాగాయెను. దరిద్రు లలో దరిద్రుఁడగువానికి నా చెల్లెలు భార్య యెటులగును? ఆ దరిద్రుని గర్వము విఱిచియ తీరవలెను. కాదేని నా దరిద్రుని యింటిలో నా చెల్లెలకు సుఖమువచ్చునెటు?

విలాస:— సుఖమెటు కలుగును?

గీ. రవినిఁ గైసేయఁ బుష్పహారంబువేయ
రోజుచును గాల్చుఁగాఁ దన తేజమునను
కోతికిని రత్నమిచ్చినఁ గొంకుమాని
నోటఁ గఱచును, దన్నును, జేటుఁదెచ్చు.

లక్ష్మి:— అట్టివారినిఁ జేరిన వస్తువు నశిగలియేను. మూర్ఖునిబలె నడుమునఁ గత్తిఁగట్టుకొని లగ్న మునకు వచ్చినవాఁడు. పెండ్లికూఁతురును గరవార ధారచేఁ గత్తరించి బలియిచ్చునాయేమి? పెండ్లికొడుకయి వచ్చినపుడు సొమ్మొకటైనను ధరింపరాదాయేమి?

గీ. చూడనంగముపై నొక్క సొమ్ములేదు
మడియునడవిని, వీడును బుడమిలేదు
వీధులను బిచ్చమెత్తెడు వెట్టివాఁడు
భాగ్యహీనునకేలకో భార్య భువిని?

అక్క:— నిజమేను. వానిశరీరముననొక బూటకపుమణి యైనను లేదు.

మాలతి:— ఇస్సీ, వానిగొంతు పిల్లిగొంతువలె వట్టిదిగనున్నది.

చంప:— వ్రేలికి నొకయుంగరమైనను లేదు.

విలాస:— అటు చూడుఁడి. బాబాసాబుగారితో ధైర్యధరుఁడు వచ్చుచున్నవాఁడు చూడుఁడి వానిమెడలో నేమైన నున్నదియో లేదో?

లక్ష్మీధ:— నేను ప్రారంభమున నే పలికితినిగదా! చూడుఁడి వాని దేహముపై నేమయిన నున్నదేమో? చక్కఁగఁ జూడుఁడి. వానివ్రేళ్లు దిట్టించి చూడుఁడి. వానిబొక్క చెవులు చూడుఁడి. పిదప నా బావలీలను జూడుఁడి. శ్రీమంతునకును బీదకును నంతరాయమెంతయో కనుఁగొనుఁడి.

విలాస:— జూడుఁడి చేతులలోఁ గడియముగాని మణిబంధనముననొక కంకణముగాని యున్నదేమో?

చంప:— ఇట్టివానిని నేనెచటను జూడలేను. వీనియెముక, కుక్కయైనను నంటదు.

మాలతి:— వట్టిగొంతు. విధవగొంతువలె యపలక్షణమైనది.

అక్క:— శిరముపైనొక తురాయియైనను లేదు. ధూళితో నిండిన వాని రుమాల తురాయిలేక జుట్టులేని సన్న్యాసి తలబలె, బోడిగనగపడుచున్నది. అమ్మా! వలదే నాచెల్లెలు బంగారుబలె నున్నది. వానిదార గావలదు.

( బాబాసాబు ధైర్యధర శీలధరులు ప్రవేశించుచున్నారు. )

ధైర్యధ:— బాబాసాహేబుగారూ! నేనవసరపడుచున్నాననుటకు మఱేమియుఁ గారణములు లేవు. ఉత్తరాధిపతి చేసికొనిన సంధికట్టుబడిరీతిగ రెండునెలలును సమాధానముననుండక తన సేనతో నా శిబిరముపైఁబడ యత్నించుచున్నాఁడను వార్త నేఁడే నేను వింటిని. శత్రువులు మన సేనపైఁబడి దుందుడుకు లొనరించుచుండఁగ, నేను లగ్నోత్సవమున మునుంగుట సమంజసము కాదు. చెప్పుటయేమనఁగా, రేపు ప్రాతఃకాలముననే లగ్నము ముగించి నాకు శిబిరమునకు సెలవిండు.

బాబా:— అటు కాదండీ! రెండుదినము లుండుఁడి. శిబిరములో గడబిడయేమియును గాదు.

విలాస:— రెండునెలలవఱకు యుద్ధము నిలుపవలెనని కదా కట్టుబడి?

శీలధర:— ఇష్టము పుట్టినయెడలఁ గట్టుబడివిఱచుట యెంతపని? ఉత్తరాధిపుఁడు సంధి విఱచునను చిహ్న స్పష్టముగ నగపడుచున్నది. కారణమేమనఁగా శత్రురాజు దారి దోపుడుగాండ్రతోఁ గూడి, కట్టుబాటునకు విరుద్ధముగా నాలుగైదు శిబిరములపైఁబడి కొల్లగొట్టినాఁడు.

లక్ష్మీధర:— ఉత్తరాది పుండంతటి వికారి కాండు. ప్రారంభమగుట కింకను నెలన్నఱ యుండఁగనే వాఁడు మఱలనిపుడు యుద్ధమొనరింప సిద్ధుఁడగునా?

శీల.— యుద్ధమధ్యమున నిట్టి మోసములే యగుచుండును. అటులుండ శ్రీమంతులును పేదవాండ్రును నిచట నేరీతుల నిలువవలెను?

లక్ష్మీధర:— శ్రీమంతులను యుద్ధమంతయును, సకలుని వాక్యావలంబమున నిలిచియుండును. బీదవారికి నంతఃపురము లేదు. శోభనోత్సవములు లేవు శారీర సుఖములు లేవు. కావున వారు దినముల కొలఁది యుద్ధమగుచుండినను, రాత్రులుకూడ నచేరీతిగఁ గావలెనని కోరుట సహజము. అయిన శ్రీమంతుల మాట వేఱు. శ్రీమంతులు రాత్రులు బీదలవలె నుద్యోగులు కారు. రాత్రులు తమ యుద్యోగములు ముగించికొని మరుదినము సూర్యుఁడస్తాద్రిఁ జేరు వఱకు గాఢనిద్రలో నుందురు. అస్తమయ మగుచున్నది. రాత్రి వచ్చుచున్నది. ఈమధ్యకాలములో నొకగడియయో, యర్ధగడియయో, పావుగడియయో, యుద్ధమొనరించుట మనుంబోలు శ్రీమంతుల ప్రకృతులకు సహజము. ఈ శ్రీమంతత్వచర్య శత్రువుల దిక్కునుండు సర్వులు నెఱుంగుదురు. శిబిరములపైఁ బడుదురను కల్పన దరిద్రులదని, తోఁచుచున్నది. అనఁగా నుత్తరాధి పుండప్పుడే దండెత్తునని నాకుఁ దోఁపదు.

విలాస:— ఆలస్యమగునని యిట్టి దడబడలు చేయుచున్నవాఁడు. ఇది యెప్పుడు శ్రీమంతుల లక్షణము కాదు.

లక్ష్మీ:— నేను జెప్పుచున్నానే. నేను శాత్రవ సేనాధిపతినైయుండినచో, రెండు నెలలు కాదు రెండేండ్లు యుద్ధమునకు సెలవిచ్చుచుంటిని.

శీలధర:— మనపృథ్వీవర మహారాజుగారి యదృష్టము మంచిది కావున వారికి మిమ్ముంబోలు వారిని సేనాపతులుగని యమించు బుద్ధి పుట్టలేదు. సేనాపతి యొక్క వాల్గుదినము లిచట విశ్రమించుటకు నటంక మేమియును లేదు.

ధైర్యధ:— మీరేమయిననను(ఁ)డి. నామనము శిబిరమునకుఁ బఱుగిడుచున్నది. బాబాసాబుగారూ: తాము యుద్ధమునకునై తనుమనధనములెల్లనిచ్చి సాహాయ్యమొనర్చుచున్నవారు. కావున రణాంగణముదిక్కు పఱుగిడు నా మానసోత్సాహమునకు నాటంకము మీరేల వచ్చెదరు? నేనెటువలుకుదును? నేను శ్రీమంతుఁడను గాకయున్నను మీరు తమ బిడ్డను నాకిచ్చెదనని పలికితిరి. నా యుద్ధసంరంభము గౌరవించితిరి. మిగతవారికి నదియేమి తెలియును? ఇదియంతయు నిజమైనను మీరు నామాట లించుక వినవలెను. ఉదయమున నే లగ్నముముగించి, మఱునాఁడు నేను శిబిరముఁ జేరులాగున సెలవియ్యవలెను.

బాబా:— ఆవిచార మంతయు నుదయమునఁ జేయుదము. ప్రయాణమై మీరిపుడే వచ్చినారు. నా బిడ్డ భామిని మీ భవిష్యత్పత్ని యిపుడు మీకు మహిషాసుర మర్దనీప్రసాద మిచ్చును. పిదప మీరించుక విశ్రాంతినిఁ గొనుఁడి. రేపటిమాట విషయమున నెమ్మదిగ మాటలాడుదము. అక్కా! చంపా: మాలతీ: ఏల భామిని యిచటఁ గానరాదు? పో బిడ్డా పో. దానినిద్దరలో రమ్మనుము ( అక్క చంప మాలతి వెళ్లుదురు ) మీరు దేవీ దర్శనము చేసికొనవలెను. ఇంతలో

నే భామినివచ్చి మీకుఁబ్రసాద మిచ్చును.

ధైర్యధ:—( దేవికినమస్కరించి ) బాబాసాహెబుగారు: ఇదేరూపమున నున్న దేవిదర్శనము నాకుఁబూర్వమునలేనది.

బాబా:— మీరీమందిరములో నేఁడే ప్రథమమునఁ గాలుపెట్టినది అయిన యీదర్శన మీకెట్లు యీయెను?

ధైర్యధర:—

ఉ. మాతను జూచినాను రణమండలిలో విహరించుచుక్, జగ
న్నేతకుఁ దారహారముగ నేర్పునఁ గూర్చుచునుండు, వీరసం
జాత పునీతరుండములు, సంగరసీమను నేర్పటించి, నే
నాతటినెల్లఁ గాంతును మదంబను నీమహిషాసురార్దినిక్

లక్ష్మీ:—( అవతల విలాసధరునితో ) ఎన్ని ప్రగల్భములు పలుకుచున్నాఁడు వీఁడు వీఁడుయుద్ధ సమయమునఁ బ్రత్యక్షముగ మహిషాసుర మర్దనినిఁ జూచినాడఁట! వీరవారు తమలోపములను గప్పివేయు నిట్టి డాంబికము మాటలాడుచుందురు. (మరలుచు) ఏమండీ: మీకుఁబ్రత్యక్షముగ దర్శనమాయెనా? ఆ!

ధైర్యధ:—రణాంగణమున, మహిషాసురమర్దనీదర్శన మెవరికిఁ గాఁజాలదు. దీనివిషయమున వాశ్చర్యము మీకేల? ఏమండీ. యుద్ధావనిని నెల్లకాలము లందును దేవతా సంచారముండును.

చం. సురలకు మందిరమ్మగును నూవె రణాంగణమెందు, దేవతా
వరుల విహారచారు తరభవ్య తలంబది శూరవారభ
కరతరవార సారతర కాంతినిరంతర శోభితమ్ము శ్రీ
కరమహిషాసురారి చిరకాలము భక్తులఁ బ్రోచునచ్చటక్.

బాబా:—ఏమేభామినీ: ఏమేభామినీ: కుసుమా: వచ్చెనా భామిని? భామిని యెచటనున్నది.

కుసుమ:—( పరదాలోనుండి ) బాబాసాహెబుగారూ: భామిని యిచటనే వాకిలివెనుక నిలిచినది. మీరుపిలిచినచో ముందరికి వచ్చును.

బాబా:—( వాకిలివద్దకువచ్చి ) భామినీ! ఇంతటిసిగ్గేల. వెలికిరమ్ము.

భామిని:—నేనురాను. నేనుఖండితముగ రాను. మఱలఁ బలికెదను నేనురాను.

బాబా:—ఏమి యీపిల్ల పిచ్చిదైనది. ధైర్యధరగారూ: నేనిపుడే పోయిదానినిఁ బిలిచికొని వచ్చెదను.

ధైర్యధ:—బాబాసాహెబుగారూ: మీకంతటి శ్రమయేల? దానికినిచ్చ లేనపుడు మీరేల బలవంతముగ మాకుసన్మానముఁ జేయింపఁ బూనెదరు? ఇప్పటికైనదని బాగుగనే యైనది. నేను వెంటనే శిబిరమునకుఁ దిరిగిపోవ నిపు డేయభ్యంతరమునులేదు. మహిషాసుర మర్దనీ దర్శనము

యుద్ధసూచకము. ఇట్టి దర్శనమైనపిదప, లగ్నమంటప మెక్కకోరికకంటెను యుద్ధమునకు సిద్ధమగుటయె, కర్తవ్యము.

( వెళ్లుచుండును )

శాబా:—వద్దండీ! వద్దు. కొంచెము నిలువుఁడి. పిల్ల మూర్ఖురాలు. ఇటుచేయకుఁడి. నన్నుఁజూడుఁడి. కోపమువలదు. ఈ యపమానమును నేను సహింప.

( ధైర్యధర శీలధరులు వెళ్లుచున్నారు )

శాబా:—విలాసధరగారూ! అతఁడు కోపగించి వెళ్లిపోయెను. మీరువెళ్లి వారి నూఱడించి మఱలఁ బిలిచికొనిరండు.

లక్ష్మీనాథ:—వాఁడు తనశిబిరమునకు వెళ్ళిపోనిమ్ము. విలాసధరగారూ! వానివెంట మీరేలపోయెదరు? వెళ్లుదము నావెంటరండు. పెండ్లియరుగు దారిఁబట్టెదను. భామిని లగ్నమంటపమునకు వచ్చిన క్షణముననే నేఁ బెండ్లిపీటపైఁ గూర్చుండెదను.

( యవనిక పడును )



# మా నా ప మా న నా ట క ము.

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

### వి లా స ధ ర సి బి ర ము.

విలాసధర వినోదుల ప్రవేశము.

వినోద:— మహారాజా! నామొఱ వించుక వినవలెను. నాకు నంటిన యీ తిరుగుడుపీడను వదలింపవలెను. ఏమండీ! దినదినమును ప్రాతఃకాలమునందు భామినితో శిబిర శిబిరములు తిరుగుచుఁ దిరుగుచు నాకు నింతుగ్రశ్రమయైనది. కావున నేయుపాయమైనను వెదకి త్వరలో భామినీ లక్ష్మీధరుల వివాహ మనుగీతిఁ జేయుఁడి. అటుచేసినచో భామినితోఁగూడి యుద్ధరంగమునఁ దిరుగు కష్టము నాకుఁదప్పును. ఈ స్థళమున యుద్ధమయినపుడు ధైర్యధరుఁడు తన పరాక్రమము చక్కఁగఁ బ్రదర్శింపఁ జేసెనని యెవరు భామినికి దెలిపిరోగాని యా భామిని గడియగడియకు రణాంగణము దిక్కుననే చూచుచు నిలిచియుండును.

విలాస:— ధైర్యధరుని పరాక్రమోదంతంబు భామినికి నెవరు తెలిపిరి?

వినోద:— యుద్ధసంగతు లెవరెవరికిఁ దెలుపవలసినదియు లేదు. కొంచెమిచటికి నచటికిఁ దిరుగుచుండినచో, వెంటనె సంగతులు తెలియవచ్చును.

విలాస:— నిజమిది. ఒకనెల భామిని రణాంగణ సమీపముననుంచిన పిదపఁ గావలసియుండిన యెడల లక్ష్మీధరునకిచ్చి పెండ్లిచేయవచ్చునని బాబాసాబుగారు హఠముపట్టినారు. ధైర్యధరుని పరాక్రమక్రమము భామిని యిచటనుండినచో వినునని బాబాసాబుగారు పన్నినయుక్తి యని యిపుడు నాకుందోఁచుచున్నది. ధైర్యధరుఁడెంతటి పరాక్రమవంతుఁడైననదియు భామిని మనములోఁ జక్కఁగ నాటినది. ఏమనియెదవునీవు?

వినోద:— నిజము నిజము. మీరాదినముననే లక్ష్మీధరునితోఁ బెండ్లిచేసియుండిన యెడల.

విలాస:— నే నటులనే చేయనుంటిని. అయిన, నా ముసలివాఁడు సమ్మతించునంతలోనే యీ పోరుగాలివీచెను. కావున నటంకమాయెను. మఱల ‘‘ధనముహెచ్చా పరాక్రమము హెచ్చా’’ యను విషయమును భామిని కనుఁగొనవలెనని దాని నిచటికిఁ బంపినాఁడు. భామిని, యెచటనుండునదియుఁ దెలిపెదవా?

వినోద:— ధైర్యధరుని శిబిరసమీపముననుండు కుసుమయొక్క యుద్యానవనమునఁ గుసుమతోఁగూడి యున్నది. వనమాలయని మాఱుపేరు భామిని యుంచికొనినది. కుసుమ తనపేరు పుష్పమాలయని మార్చినది.

విలాస:— నీ వెందుకు మాఱుపేరుంచికొనలేదు.

వినోద:— సునలితనము యొక్క సర్వరూపములరీతిగఁ జేర్చినతేము మాటలకరమే నిలుచునుకదా? నే నిపుడు నా పేరదవదలుసేయు నిచ్చ యేమేమియును లేదు. పాదములు మాత్ర మొకచోటు నుండి మఱియొకచోటికి మార్చుపనియున్నది. ఆ కష్టము నాకు లేనట్లులఁ జేసినఁ జాలు.

విలాస:— భామ్మ. నీవేమియుఁ జింతింపవలదు. నేనాయుద్యోగములోనే యున్నాను. భామిని, వనమాలయను పేరుంచికొనినదనియు, భాబాసాబుగారి యానతిరీతిగ రహస్యముగ శిబిర ప్రాంత్యమున నున్నదనియు నచటనే తిరుగుచుండుననియు దానిమనము ధైర్యధరునిపై నిలిచినదనియు నీ వార్తలన్నియు నా కింతకుఁబూర్వమే తెలియును. వీనినన్నిటికి నంతరాయముఁ గలిగింప నైశమ్మే ప్రయత్నించుచున్నాను. నీవు వెళ్లుము. ఏమయినను హెచ్చుతగ్గులైనచో నాకు వెంటనే తెలుపుచుండుము. ( వినోదుఁడు వెళ్లును. ) లక్ష్మీధరుననును భామినికిని వివాహమగుట యెట్లులు? అన్ని శిబిరస్థళములు రహస్యముగ సంచరించుచు భామిని ధైర్యధరుని కంఠమునఁ బుష్పమాలవేసినచో నాయొక్కయు సకల శ్రీమంతుల యొక్కయు మోములందు మసిపూసినట్లగును గదా? భామిని జననము శ్రీమంతుని మందిరమున. దాని సోదరి శ్రీమంతుఁడగు నా భార్య. శ్రీమంతుఁడగు లక్ష్మీధరుని భామిని వరింపవలెను. ధైర్యధరుఁడు కడుపేదయని భామిని నిరాకరించినది. మఱల నది యా భికారి యిల్లుఁ జొచ్చినచో మా శ్రీమంత పుత్రులెల్లఁ బ్రాణముల నెటునిలుపుదురు? వెయ్యేల తేటమాట లాలోచించినను భామిని లక్ష్మీధరునినే...... ( లక్ష్మీధరుఁడప్పుడే పెట్టెచేతిలోఁ బట్టుకొనివచ్చును )

లక్ష్మీధ:— వరించునట్లులఁ జేయవలెను. అగునదియు నదేరీతిగానే. దానికి సందేహమేమియును లేదు. ఇప్పటి నావస్త్రభూషణాద్యలంకారములను నీవు చక్కఁగఁ జూచినచో నీకే సందియమును గలుగదు.

విలాస:— మీరు చక్కఁగ శృంగారించుకొన్నారు.

లక్ష్మీధ:— [illegible]ప్పుడద్దములో నా వేషమును జూచికొంటినో యప్పుడే నాకదేరీతిగఁ దోఁచెను.

విలాస:— ఏమి[illegible]చెను?

లక్ష్మీధ:— నేను భామినినైతిని నిజముగ నైతిని యనితోఁచెను. నీకు నట్లులఁ గపడదా? నేను భామిని వలె నైనానని నీకుఁ దోఁపదా? ఏమీ! ఇట్టి ననుఁబోలు శృంగారపరుఁడు దొరకుట పూర్వ జన్మఫలమనియు నీజన్మమందు లేకయున్నను ముందుజన్మమందైనను నాడుఁజన్మమునఁ బుట్టింపుమని పురుషులందఱుఁ బరమేశ్వరునిగుఱించి ప్రార్థింపకవదలరు. స్త్రీజాతి యనుభవమీరీతిగ నుండును. నన్నుఁజూచి స్త్రీజాతి యంతయును. దనకు నేనే భర్తగఁ గావలయునని మాటలాడుచునుండు రవునాకాదా? నీకును నదేరీతిగఁ దోఁపదా?

విలాస:— నాకేమియుఁ దెలియదు. ఇపుడీవేష ముపయోగము లేదు. నీవు నీతరవారమును దీసికొనిరమ్మని మొదటనే చెప్పిపంపితినిగదా? ఈ పెట్టెనేల తెచ్చితివి?

లక్ష్మీధ:— ఈ పెట్టె, మంచిముత్యములతోను వజ్రములతోనుఁ జెక్కఁబడిన సొమ్ములతోనిండినది. భామినిని వశపఱచికొనుటకు ఖడ్గమేల? అందుదానిని హస్తగతగ నొనర్చునది సొమ్ముల దెబ్బయేను.

చం. కనక విభూషణమ్ములను గాంచిన, కాంతమనమ్ము వానికిఁ గొ
గొనఁజను, వానిప్రాప్తికినిఁ గొంకక యెప్పుడు వైనఁ జేయుఁ, ద
ప్పని యువతీ వశీకరణబంధుర యంత్రము కాంచనమ్ము, భా
మిని యనిజూడఁ దెచ్చితిని మెచ్చును నన్నును హెచ్చు వచ్చికన్.

విలాసధరా! ఈ పేటిక చిన్నభామినియని తెలియుము. పెద్దభామినిని జూచుచుండినఁ జిన్నభామిని వెంటనంటును. చిన్నభామినినిఁ జూచుచుండినఁ బెద్దభామిని వెంటనంటును. పెద్దదుండినచోటనే చిన్నది. చిన్నదియుండినచోటనే పెద్దది. ఇటులనేకదా యైంద్రజాలక విద్య? ఆకారణముననే కావలసినన్ని సొమ్ములతో నించిన పెట్టెను దెచ్చినాను నా యెదుటనే యుంచికొనియున్నాను. ఇటులుండ నిఁక ఖడ్గమేల?

విలాస:— ఏమండీ! భామిని మీచేతినుండి జారెనని తెలియుఁడి. వినోదుఁడిప్పుడే వచ్చిపోయెను. వాఁడుసైత మొక విరుద్ధవార్తఁ దెచ్చెను. ఏమన మీరు మీ కృపాణము.

లక్ష్మీధ:— ఏవార్తనుగురించి విరుద్ధము? భామినికేమి చెఱుగుమాసెను?

విలాస:— అదికాదు. భామిని శ్రీమంతునివలలో నిదిపడుటఁ బడియుండెను. ఇప్పుడు పరాక్రమము దిక్కు నించుకించుక జారుచున్నది గనుక నీవు నించుక పరాక్రమమును జూపఁ బ్రయత్నింపక యున్న భామిని ధైర్యధరునిదిక్కు వాలును. ఇది నిజము.

లక్ష్మీధ:— పరాక్రమముఁ జూపవలెనని పలికెదవా? అది నానుండి కాఁజాలదు. నీవు ఖడ్గముఁ దెమ్మని నమాట యందినవెంటనే, పది యిరువురు సేవకులనుబిలిచి ఖడ్గమును వెదకఁడని పంపితిని.

విలాస:— అయినఁ గృపాణము దొరకదాయెనా?

లక్ష్మీధ:— తుదకు దొరకెను.

విలాస:— లేనికారణమేమి?

లక్ష్మీధ:— తుక్కుబట్టి యొఱనుండి వెలికిరాదయ్యెను. నేను నిండుగ శ్రమపడితిని. తరవాత శౌర్యము చూపకున్న భామిని దొరకదేని యది ధైర్యధరునినే, వరింపనిమ్ము. నాకేమి యాఁడువారు కఱవా? ఈ పేటికలోని యొక్కవస్తువునకే యనేకు లాఁడువారు దొరకుదురు. మఱియేమి?

విలాస:— లక్ష్మీధరగారూ! మీమాటలువిని నేను నవ్వుదునా యేడ్తునా యనునది తోఁపకయున్నది. ఏమండీ. లోకుల యోగ్యతగొప్పతనములోనున్నది. అటులుండ శ్రీమంతులగువారు తమముంచిబిడ్డల నితరులయిండ్లకు నిచ్చినయెడల లక్ష్మీదేవి సైతము తానును మమ్మువదలి యితరుల యిండ్లకుఁబోవదా? ఆఁడువారి పాదము వెలికిఁబడినచో వెంటనే లక్ష్మీదేవి పాదములు సైతము వెలికిఁ బోవును. ఎవరు లక్ష్మిని భద్రపఱుపఁ దలఁతురో వారాఁడువారినిఁ బోగొట్టుకొనఁగూడదు. లక్ష్మీదేవికంటె నాఁడువారి యోగ్యత హెచ్చగు కారణంబున రామరావణ యుద్ధంబులయ్యెను.

గీ. కలిమి, బలములు, శౌర్యంబుఁ గలిగియున్న,
వనిత, సిరులకు నెల్లను వసతియనుచు,
సతిని సీతనుఁగొనిపోయె శతముఖుండు,
గానఁ గలుములచేడియ కలికి గాదె.

ఎప్పుడాఁడుది తన్నువదలి పోవునో యప్పుడు వాని సర్వస్వముఁబోయినదేను. లక్ష్మిపోవును బలము విఱుగును సంసారమే క్షణభంగురమగును. భామినిని బోలుదాని మనోవృత్తిఁగాంచ లక్ష్యము కలిగెనేని జీవితము పోయినట్టేయగు. ఒక పతూరి యొవని స్త్రీ మానసవృత్తికిఁ జాంచల్యము కలుగనో వానిని నానియుంటిని వానిసమాజమును మూలఁకట్టినరక సమీపమున నుంచి నట్టని తెలిసికొనవలెను. లక్ష్మీధరగారు అటులైన భామినినిఁ దమసమాజమునుండి వెలికిఁ ద్రోయుపనివలదు. మముఁ బోలు లక్ష్మీపుత్రులపని యేమినిలిచెను?

లక్ష్మీధర:—భామినిని పశపఱచి కొనుట నాయిచ్ఛలేకపోలేదు. అయిన నామతసిశ్చయము నాకునమంటినది. కృపాణవిషయమకంటె నాభరణవిషయమధికోపయోగమని నేఁ దలంచుచున్నాను. నీవు వనితలను బురుష దృష్టితోఁ జూచుచున్నావు. నారీలిగనాకుపారిదృష్టితో భామినినజూచినచో నాడువారిచర్య నీకుఁజక్కఁగఁ దెలియును. ఆడువితనంతకుఁదానే మనమంపని యెడల దాని రహస్యమును దెలిసికొనుటకష్టము. మీ రొకయాకుదానని తెలిసికొనుఁడి అటులయిన యీపేటెకనుఁ జూడుఁడు. (పెట్టెమూతఁదియును.) అప్పుడు మీ మానసపరిణామమెటులుండునో తెలిసి కొనుఁడి. ఈ సొమ్ములకాంతి మీ కనుగవ నిండును. ఇవిమీకండ్లు నిండినయెడల వానినిమూయుట కష్టమగును.

గీ. సొమ్ముసపసములు కలయును సమమనమ్మ
లటులేకూడదను తెలియుమా, యర్థమున్న
చోట నర్థంబుఁ జేరును జోద్యముగను,
సుందరాంగునిఁ జేరును సుందరాంగి.

ఇపుడుచెప్పుడీ చూతము నాయుపాయముమేలా? మీయుపాయముమేలా? ఏమి మీ ముఖభావము మీ నిట్టూర్పు. ఏమో తెలియకున్నది? మీయనుభవము మీఁదనే మీరు తెలిసికొనుఁడి. మీకే యిటులైనచో నీపేటెకనుఁ జూచి భామిని యెటులగునో?

విలాస:— లక్ష్మీధరుగారూ; మీకు నామాటల యభిప్రాయము తెలియరాదా? సొమ్ములకు లుబ్ధుఁడనగుటనాముఖభావము మాఱినదని కదా మీరు తెలిసితిరి? మీ, యొక్కొకశబ్దమెటు లెటుల నా వీనులలోఁ జొచ్చెనో యటులటుల నాకుఁదోఁచినదేమన భామినీకార్యమున మాకు హెచ్చుకష్టమగునని. నా నిట్టూర్పునకుఁ గారణంబదియేను. మిత్రమా! నా పలుకునించుకవినుము. వినినచోఁ జెడినకార్యము చక్కఁబడును.

లక్ష్మీధర:— వినననినేనెపుడంటిని?

విలాస:— ఈ పేటిక మొదటమూతమూయుఁడి. ఇదె గనుము. ఏపురుషునియొక్కగాని, స్త్రీయొక్కగాని మనములో విశేషకారణమేమియుఁ జొరకున్న యెడల సామాన్యప్రవాహమే

పొంటుచుండును. అట్టివారిపై నధనము పనిచేయును. పురుషులెటు ధనమాశింతురో స్త్రీలు నదేవిధముగ నాశించుచుందురు. వ్యక్తివ్యాపేక్ష గలవారు దాని నాశించి ధనికులైనవారలగు దురు. ఇది సామాన్య స్త్రీపురుషులమాటగ నున్నది. అయిన ధనమునుండి క్షేమము కల్గునన్నట్లుగు చున్నదని మాత్రము తెలియవలదు. క్షేమమునకు ధర్మచక్షువు లేదు. కావున లక్ష్మీప్రకాశము దాని కగపడదు. కావుననిట్టి యుపాయము లింతటితో వదలి భామినీయంతర్భాగమునందుకు జొచ్చు ప్రయత్నముఁ జేయుము.

లక్ష్మీ:— చాలునబ్బా! నీవెటు చెప్పెదవో యటులొనరింతును. ఈ సొమ్ముల దెబ్బ వెనుకకేయుదును. ఇపుడు నీవు చెప్పెడిమాటయును జింతించుచుండెద.

విలాస:— దీనినివినుము. భామినీలక్ష్మి యిపుడింతకు శౌర్యము దిక్కుచూలుచున్నది.

లక్ష్మీప్రకాశ:— నిజమా? చాలుచున్నదియా? నీకుఁదెలుసునా? అటులైన నేనింక నెచటనెట్లు శూరుఁడ గుదును? దానిని దెలుపుము. శూరుఁడగుటకు నాకేమి పోవును? అలంకారములు ధరించి శూరుఁడగుదును. ఏమిపనిపడునో యాపనిఁజేసెద. మనోహరురాలగు సుందరి దొరకుటకై సేవకునిబలెఁ గష్టపడుటకు నభ్యంతరమేమున్నది?

విలాస:— ఇదిసరియయినమాట. ఇఁకనీవుశూరుఁడగుట యెట్టులనో, దానిని దెలిపెద. శిబిరవీధులందు దండోరా కొట్టినవార్త నీకుఁ దెలిసి యుండునుగదా?

లక్ష్మీ:— ఏమి దండోరాయది?

విలాస:— శత్రువులు చిన్నచిన్న గుంపులు నేర్పరచుకొని యాత్రికులు మన శిబిరములపైఁబడి కొల్లఁగొట్టను దిరుగసాగినారు. నీవేలటు భయపడియెదవు?

లక్ష్మీ:— కొల్లఁగొట్టనిచటికి వారువచ్చినారని.

విలాస:— ఇపుడేమిభీతి? ఇచటికి వచ్చునారెవరు? దండోరావిషయము నేను దెలిపితిని. కొల్లఁగొట్టను శత్రువులు వత్తురంటిని. ఇఁకనురా లేదుకదా?.

లక్ష్మీ:— ముందువత్తురనియా? ఇపుడురా లేదుకదా?

విలాస:— లేదు. లేదు.

లక్ష్మీ:— అట్లయైన నభ్యంతరములేదు. ఇఁక ముందుచెప్పుము నీ మాటలు. దండోరా కొట్టినారు. అదిచాలును. ముందు?

విలాస:— దండోరా కొట్టినారు. భామిని తనమిత్రురాలగు కుసుమయొక్క యుద్యానవనమున నివసింప సాగినది. కావున నేఁ జెప్పునదేమన నేను శత్రువేషమును ధరించెద. భామిని యిల్లు నుఁ గొల్లఁగొట్టఁబోయెదను. భామినియఱవసాగినయెడల నీ వొక్కతూరి ముందుకేగి రమ్ము. మఱియొకతూరవుఁ దూర్వశిని విడిపించినటుల విడిపింపుము. నీ మనసుకు వచ్చెనా?

లక్ష్మీ:— ఏమిచెప్పితివి. భామిని యఱచినంతట నేను శూరునిబలె నీమీఁదబడవలెనా? మంచిది. ఇదియంతయు బాగుగనున్నది. అయిన మీరే నాతో యుద్ధము చేసినయెడల?

విలాస:— అటులకాదు. నీవేముందటికివచ్చి నాపైఁగత్తినిఁదూసితివేని నేను బయిగెత్తిపోయెదను.

లక్ష్మీధర:— నీవు పిఱికి. నేను శూరుఁడ. ఇటులఁ బ్రదర్శింపవలెనా?

విలాస:— నిజము. అదేరీతిగనే. మీరుమీతరవారిఁ దెచ్చియుండినయెడల దానిని మీరెటు నాపైనుపయోగింపవలెనో, యావిధమును నేర్పుచుంటిని.

లక్ష్మీధర:— నేర్పుట వలదు. యుద్ధములో, నీయున్నఁ దనంతకుఁదానే వెలికివచ్చును.

విలాస:— మీది లేకయున్న మీరు నా కత్తినిఁబుచ్చుకొనుఁడి. వాయంగను పై నెటుకత్తినిఁదెత్తునో చూపుఁడీ.

లక్ష్మీ:— మంచిది చూచెద. నీవు భామినిపైఁ బడుటెటులనో చూపుము.

విలాస:— మంచిది. నేను భామీ నీమందిరంబునఁ జొచ్చితినని తెలిసికొనుము. నేను దానిని భయపెట్టు మాటలాడిన క్షణముననే మీరుకత్తినిదూయుఁడీ. "ఓపిల్లా! అన్ని సొమ్ములును విచ్చియిచ్చుటఁబెట్టుము. కాదేని ప్రాణాంత్యమేను" ఈ మాటలాడెదను. కత్తినెటులెత్తెదను. [ఎత్తును]

లక్ష్మీ:— (కంపించుచు) సకలాభరణములనిచ్చెద. నాప్రాణముఁదీయకు. అన్నినగలును దీసికొనుము దేహము మీదివికూడదీసికొనుము. పేటికసైతము తీసికొనుము.

విలాస:— ఏమండీ! మీరటులేల చేసెదరు? మీరు నాపైఁబడి నను గత్తిచేఁబొడిచినరీతిఁజేయుఁడీ.

లక్ష్మీ:— నేను దానిని మఱచితిని. మీరు నిండుభీకరముగఁ బలికెదరు కావున నాకటుభయమాయెను అదిగాక మీరుత్తరదేశభాషలో మాటలాడకున్న మీరు చోరులు నేను నెమలియని తెలియకుండలేదు. ఇఁక మీరుత్తరదేశము మాటలాడితిరేని మీ సమాచారము తెలియవచ్చును. [విలాసధరుఁడదేరీతిగఁ బైవాక్యము పలుకును. లక్ష్మీధరుఁడు వడఁకుచు మోకాళ్లపైఁ గూర్చుండి సొమ్ములపెట్టెను ముందఱఁబెట్టి దేహముపై సొమ్ములు తీయుచుఁ బూర్వమురీతిగఁ బ్రార్థించును.]

విలాస:— ఇదియేమి లక్ష్మీధరగారూ! ఏమండీ మీరు శూరులు వీరులుననునది మఱవకుఁడీ.

లక్ష్మీ:— మంచివేళలో నటంకమాయెను. ముందీతప్పుఁ జేయను. ఇదిగో మీరాసమయమున నుత్తరదేశభాషయేమియునాడకుఁడి. ఆభాషనన్ను నిండుగభయపెట్టుచున్నది. భామిని సరస నారీతిగఁ గుక్కలబలెనఱవకుఁడి. ఆఁడువారిబలె మృదువుగఁ బలుకుఁడి. "పిల్లా! సొమ్ములు విచ్చియిమ్ము. కాదేని ప్రాణాంత్యము" అని పలుకుము.

విలాస:— భామిని మీ భవిష్యత్పత్నియని యిప్పటినుండియు, దానినింత మెత్తతనమునఁ జూచుచున్నారు. నేను దొంగవలెనఱచినపుడది బెదరినచో మీకేమి?

లక్ష్మీ:— అదియెవ్వటికైనను నాసొమ్మేకదా; కావుననీవు మృదువుగమాటలాడుము. "పిల్లా, సొమ్ములు విచ్చియిమ్ము కాదేని ప్రాణాంత్యము", అనినచో నేనెటుగర్జించుచు నీ దేహముపై వేగమున వత్తునో యది చూడుము. అదిగాక నీ తరవారి నాకుఁబొందదు. నీవేతీసికొనుము. నా శిబిరమునకురమ్ము. అచట నాకుక్కుపట్టినకత్తినిఁ జిక్కఁజేయుదము. అపుడు నావిక్రమమెంతోగనియెదవు.

విలాస:— వద. నీ శిబిరమునకుఁ బోవుదము. అచట నీకుఁ జక్కఁగఁ నేర్పెదను. (వెళ్లుచుందురు.)(స్వగతము) శ్రీమంతులమర్యాదను గాపాడుటకై యీవిటశిని దన్ని ముదిరినశూరునిఁ జేయఁ జూడవలెను.

(నిష్క్రమణము)

## ద్వితీయరంగము.

### కుసుమపురంపు రోపవనము. ధైర్యధర శీలధరులు.

ధైర్యధర:— శీలధరా! దీనిఁ వింగనుము. నేను వచ్చినకొన్ని దినములనుండి చూచుచున్నాను. ఈ యింటిలో మఱల జనులు వచ్చి చేరినా రని తోఁచుచున్నది.

శీలధర:— మీకయిన విజయకారణంబున శత్రువులవని యేమియు సాగకయున్నది. ఈ లోకుల మనములందుఁ గూర్చున్నది. యుద్ధసమయములోనుండిన శాత్రవభీతిచే ఇల్లువాకిల వదలిపోయిన జనులు మఱల్ళఁ దిరిగి రా సాగినారు.

ధైర్య:— అవసరపడి యిటు వచ్చుచున్నారు. అవసరపడ నేల? నానుండి కలిగినదియే యీ తప్పితము. లగ్నవ్యగ్రమనస్కుఁడనై కొంతకాలము నేనుండ సైన్యవ్యవస్థ యించుక చెడినది. అకారణముగ శత్రువులకు సమయము దొరకెను. కాని నేను వెంట నేరాకయుండినచో నీ చోరుల బాధ యధికమగుచుండెను. నేనిప్పుడే యెనిమిది దినములుగ నెటుదిట్టముగ కట్టుపాటొనరించితినో యిటులనే మఱియుఁ గొన్నిదినంబులుండిన యెడలఁ జోరుల బాధ బొత్తిగ నిలిచిపోవును.

శీలధర:— ఆ చోరులవాళనము చాలినంత యైయుండెను. నిన్న మొన్నటినుండియు వారు పునః తలయెత్తిరి. కారణ మేమన మేఘములు చంద్రునిఁ గప్పివేసినకారణమున రెండుదినములుగఁ జీఁకటి బలము వారికి సాహాయ్యపడినది.

ధైర్యధర:— నేఁడు సైతము మేఘములు వ్యాపించినందునఁ జంద్రుఁడు భయపడినట్లు తోఁచెడు.

శీలధర:— వాసినిఁ జూడుము. ఆ కాలమేఘము నాలుగు దిక్కులు వ్యాపించుచు వచ్చినవి.

ధైర్యధర:— దొంగలచేతఁ జిక్కిన మనుజుఁడు దీనముద్రను ధరించి యితరుల సాహాయ్య మెటు దూచుచుండునో, యారీతిగఁ జంద్రుఁడు దీనతచే నిప్పుడు నాదిక్కునఁ జూడసాగెను.

శీలధర:— నిజము. చంద్రుఁ డిపుడు దీనత్వమందినాఁడు. చంద్రా! ఇంతటి దీనతచే మాదిక్కున నేల చూచెదవు. ఆ మేఘములనుండి నిన్ను మే మెటు రక్షింపఁగలము?

ధైర్య:— మేఘము లెటులైనఁ బైన నెక్కి వచ్చుచున్నవియో యటుల నే యీ చంద్రుఁడు బొత్తిగ భయపడుచున్నవాఁడు. చూడు మెటు వాని మోము తెల్లఁ బాఱినది. ( భామిని వనములో వచ్చును ) శీలధరా! ఇదియెవరు? చూచితివా? ఇదియెవరు?

చ, జలధర చోరులాగి తనచంద్రిక సంపదఁ గొల్లఁ గొట్టఁగాఁ
గలరని భీతిచే జలజ కాండములఁ శశి దాఁచె దానిఁ
జలము చముల్ సరోవమున సర్వదిశల్గని వేసరిల్లి భూ
వలయము వీడుచుఁ గుముద బాంధవుఁ డైఁబడె భీకరమ్ముగన్,

శీలధ:— ఇది యెవరుండును? ఎవరికిఁ జేరినదియో? ఇంతటి రాత్రిలో వనమున నొంటరిగ నేల సంచరించు చున్నదియో? ఈ విషయము విచారింపఁ దగినదిగనున్నది. శాత్రవచోరు లంధకారమున నే సంచరించు చుందురు. అది దీనికిఁ దెలియదేమో?

శీలధర:— ఏల తెలియక యుండును? "జాగ్రత్తగ నుండుఁడి" యనెడి యాజ్ఞ సర్వు లెఱుంగుదురు.

ధైర్యధ:— తెలిసియును ధైర్యమున సంచరించు చున్నది. మన స్త్రీ లిటు ధైర్యమున నుంటఁ జూచి శాత్రవ చోరులాశ్చర్య పడుదురు కాదా?

శీలధర:— ధైర్యకారణమున నిటు వనములో సంచరించు చున్నదియని పల్కుట కంటెను నీపరాక్రమ ముపై విశ్వాసముంచిన యీయఁడువారైనను శాత్రవభీతి లేనివారయి యున్నవారని పలికినచో యుక్తియుక్తముగ నుండును.

ధైర్యధ:— శాత్రవభీతి దీనికి లేక యున్నను, నీ మేఘభీతి యయినను నుండవలెనుగదా? దీనిలక్ష్యము మేఘముల కై లేని కారణంబునఁగదా వనములో నిలిచినది. శీలధరా! పద, దానిసరసకుఁ బోవుదము. ఇది యెవరు? ఎవరిది? వనములో నేల నిలిచెను! ఈ విషయములన్నియును విచారించి కొని వచ్చెదము. ( సమీపించి ) శీలధరా! విచారింపుము సర్వమును విచారింపుము.

శీలధర:— అమ్మా! మా సేనకెల్ల ముఖ్య సేనాధిపతియగు ధైర్యధరుఁడు మిమ్ము విచారింపుమన్నాఁడు. మీ రెవరు? ఎవరివారు? ఇప్పటికేల వచ్చితిరి? శాత్రవభీతి మీమనమునంటదా? తుదకు వానకుఁ దడియుదుమను భీతియైనను లేదా? మీయింటిలో మఱియెవరున్నారు?

ధైర్యధ:— శీలధరా! ఒకమారే యెన్ని ప్రశ్న లడిగితివి? చోరులయొక్కయు మేఘము యొక్కయు భీతి యీమె మనమంటనిరీతిగ నున్నది. దానికిఁ జేరి కాకగనీ ప్రశ్నల దెబ్బ లేల? (భామినితో) భయపడఁ గారణము లేదు. స్వేచ్ఛగ నీవిచారమును దెలుపుము.

భామిని:— మహారాజా! కొంతకాలమునకు మున్ను వానభయముండెను. కురిచటికి వచ్చినపిదప నామేఘములు నైతము మఱలి పోవుచున్నవి. సర్వసేనాధిపతియగు ధైర్యధరుఁ డిచటనుండఁ జోరులభీతి యెవరికిఁ దవులును? మిగతచోరులభీతి లవలేశమైనను నామనమును స్పృశింపదు. నాయింటిలో నొకకడ్డీ పుడుకయైనను జోరులకుఁ జిక్కినది లేదు.

ధనరహితనైన నామన
మునఁ జోరుల భీతి యెటుల మూడును? గ్రహాణం
బునకుఁ గూ ర్యేందులు భీ
తిని రుచి చెడనంటి శమ్యదీపము చెడునే.

ధైర్యధర:—ఇదియంతయును నిజమే. నీవెవరు? ఎవరిదానవు? నీపేరేమి?

భామిని:— నా పేరు వనమాలయని యందురు. నా చెల్లెలు పేరు పుష్పమాల. మాతండ్రితోఁగూడ మేము మువ్వుర మీతోటయింటిలో నుందుము. యుద్ధసమయమున మేమిచటికి దూరముగ నుంటిమి. అయిన మాయుదరపోషణమునకై పట్టణమునుండి తేవలసిన ధాన్యాదులు కారణాంతరమువలన నిదితప్ప మాకుఁ గడుపు నింపుకొనుటకేమి మార్గము లేనందువలనను ఇంతటి త్వరితముగ మఱలి వచ్చితిమి.

ధైర్యధర:---వనమాలా! దుర్లోకధనము కాదు. నీవును నీచెల్లెలును మీతండ్రికి గొప్పధనము. అటులఁ దెలిసికొనుము. అట్టిధనము చేతికి దొరకకున్నచో శత్రువులును దాని నపహరింపఁజూచెదరు. మిత్రులును దానినపహరింపఁజూతురు.

భామిని:--శత్రువులను గుఱించిన దండో రాకునపిదప నట్టిభీతిమా నాయన్నకుఁ దెలిసి జాగ్రత్తగనుండుఁడని మాకనతేఁడు చెప్పియుండెను దిపసాంత్యమువఱకు మానాయన్న వనములోఁ బనిఁ జేయుచుండును. తాఁపునపోహెచ్చరికఁగఁ గాదియుండుపనిమాయందేయున్నది. పుష్పమాలగాఢనిద్రలో నున్నది. నాకు సునిద్రపట్టునను భయమునఁ దోటలోఁ దిరుగుచుంటిని. అంతలో మీరు వచ్చితిరి.

శీలధర --- మీరు కావలి గాచుపని సేయుచున్నారా యేమి?

భామిని.---నిజము. అటులనుటకు నేయభ్యంతరములేదు.

ధైర్యధర:-- శీలధరా! కావలిపని వారిపైఁ బెట్టుట సరికాదు. ఇదియేనా నీ జాగ్రత?

శీలధర:---. నేను కావలి పనిమిపివచ్చి కూఁతమట్టుగూరమున నిలిచియుంటిని. అనఁగాఁ గావలితిరుగుపనికిఁ గారణమేమియుఁగనపడ లేదు. అమ్మా మీరు క్షేమముగఁ బోయి నిద్రింపుఁడి. మీ కే భయమును లేదు.

భామిని ---నేనుకొంచెము కావలిపనిపైనుండినచో మీ కేమిచెడుగు?

ధైర్యధర.--- శ్శే. శ్శే.

కం. యువతి ధర్మము కాదది
బవరపు దుఃఖంబు సైఁచుపని సేనకగుఁ
బువుఁబోణ్లకు నకార్యము
లవలేశంబైన నిడఁగ లగ్గగు. నెటులన్.

భామిని:—అదియేమియు లేదు. మాయూఁడువారిపై నట్టిప్రసంగము రాదు. నేనింతవఱకు రణభూమికి దూరముగ నుండిన కారణంబున నాకు నటులనేతోఁచుచుండెను. ఈప్రదేశము సమీపించిన తోడనె భయముగనె దుఃఖాల్పడఁచుచుండెను. ఇఁకఁగొన్ని దినంబులుండినచో నాకుభయము దోఁపకయుండును.

ధైర్య:— వనమాలా: నీవిద్ధారణమటు లుండినచోఁ గావలియుండుము. పిదప నీవింటిలోపలఁబోయి జాగ్రత్తగ నుండవలెను. ఇదియుచితమని తోఁచుచున్నది. అమ్మా. శీలధరా: క్షత్రశిబిరములలో నీ వెంత భద్రముగ నున్నవాఁడవో నేను ఇకఁ [illegible] దానవలసినదిగ నున్నది. నేనును వచ్చుచున్నాను. అవశ్యకము పడినచో గట్టిగ నఱవక యుండవలదు. కావలియుండుస్థలము కూఁతమట్టు దూరములోనే యున్నది.

భామిని:—బహుశాయగత్యము పడదు.

ధైర్యధ:— దైవమటులనే చేయుచుఁగాత. శీలధరా: వెళ్లుము, (వెళ్లుదు) ఇచటనీవొనరించిన యేరాటు బాగుగ లేదు, ఆడిన మాలపైనఁ గావలిజరుపుంచుట పనిగాదు.

శీలధర:— (స్వగత) కాపలి సంబంధములో సేనాపతియొక్క కల్పన, వనమాలినిఁ జూచినప్పటినుండి మాఱినట్టు తోఁచుచున్నది.

ధైర్యధ:— వానినిఁ జూచుము. ఇఁకను గృహములోనికి వెళ్లకయున్నది. కాఁలి కాచుచు నిలిచినది.

శీలధర:— తమరు పరీక్షింపఁదగిన శిబిరములింకను ననేకములున్నవి. ఇతరదిక్కునకుఁ ద్వరలో వెళ్లుదము.

ధైర్యధ:— మహిమమాచిన్నది యింకను నేనిలిచినది. ఇంటిలోనికిఁ బోవ్వలెనని తలఁపని యాకారంబోవుచున్నది. కావలిలోనింకను నిలిచినది.

శీలధర:— మహారాజా: నేనుస్పష్టముగాఁ జెలిపెదను. ఇఁకను పరీక్షింపఁదగినపని చాలగనున్నది. సర్వకార్యములు ముగిసిన పిదప మఱల నిచటికి వత్తము.

ధైర్యధ:— అటుకాదు. అవిదాఖలనే నిలిచియున్నది చూడుము.

శీలధర:— మహారాజా: ఈ వనమాలియుండు స్థలము కావలిఁగాచుచుండఁ, జోరులు దానియొక్క గొంతుఁ గొట్టుటకు మాఱుగ, నవిమూర్తము మీ మనమును దొంగిలించెను. ఈవార్త సేనలో సంతాపించును.

ధైర్యధర:— ఛీ. ఛీ. ఇదియేమి నూతనకల్పన, సేనాగ్రగణ్యుఁడైయొక్క లోపమును మూసిపెట్టుటకై యీ కల్పన యునితోఁచెదు. పదపోవుదము. పద.

(పోవుచుఁ దిరిగి చూచి) ఛీ, ఇఁకను నా స్త్రీరత్న మచటనే నిలిచినది. (స్వగ) కీఁడిపుడు నా దిక్కునఁ జూడకయున్నవాఁడు, అఁకనున్నది యచటనే నిలిచినది. నాదిక్కునను పైనఁ పైనఁ జూచుచున్నది.

ఉ, ఈవనమోహనాంగి చపలేక్షణ తీక్ష్ణము దేమి పల్క, నా
మానసమున్ హరించె ననుమానము లేక, భయంకరారులన్
గాసని నామనం బెటులగాంచెనో యీ వనమాలి, నే నెటుల్
మానసరాహితుండనయి మానవకోటిఁ జరింతు వెట్టిసై.

(ధైర్యధరశీల ధరులు వెళ్లుదురు.)

భామిని:— (స్వగతము) నే నేలయొక్క స్థలమున స్తబ్ధనయి నిలిచితిని? వానినిఁ జూచితిని. వాని కనుఁగవ కనుకట్టు నా పాదములీస్థలమునుండి చలింపఁజాలను. ఆదెకను. ఆదెకనుము. ఎంతదూరము పోయినను పునః పైని తిరిగిచూచుచున్నవి. అయిన నే నెందుకు వానినిఁ బలుమాఱు చూచుచున్నాను. వాఁడు మాటిమాటికిఁ జూచుచున్నాఁడు కావున నేనును జూచుచున్నాను. కాదేని నే నేల వానిదిక్కుఁ జూడనిచ్ఛయింతును? నాయన్నగారును సోదరియును వందఱును నా చూపును జూచి ద్రవ్యదృష్టియని యనుచుండిరో యీ యీ. నాదృష్టి దానినుండి మాఱె నేల? ద్రవ్యము దిక్కునకే నాదృష్టి యీడ్చుచుండినది. అదే నాకిపుడు ధైర్యధరునిదిక్కునకు నొక్కరీతిగఁ బఱుగిడుచున్నది. ఇది చిత్రముకదా యేమి? చిత్రమైనను నేమి?

గీ. ధనదసమధనమగుఁగాదె ధైర్యధరుని
ధీరతనుఁగన నమ్రత దీనయగును
ధరణి నవనిధులొక్కటై దాల్పుఁ జజ్జ
ద్రవ్యమెంతటిదగు శౌర్యధనము మ్రోల

(చోరుని వేషమును ధరించి విలాసధరుఁడొకప్రక్కన వచ్చును మఱియొక ప్రక్క నుండి లక్ష్మీధరుఁడు పిచ్చుకత్తిఁ బట్టికొని వచ్చును )

లక్ష్మీధర.—(వడఁకుచు స్వగతము) పిండీగడ్డమును గట్టికొనినందున వాని వేషము చిత్రముగ నున్నది. వీఁడు నిజముగ దొంగవాఁడు కాఁడుగదా? అటులుండిన పొరపాటు పరిణామము చక్కఁబడదు. ప్రథమమున నేనువిచారించి తెలిసికొనవలెను (ప్రకాశ) ఏమండీ మీరు నిజముగ దొంగలా? దొంగవేషమును ధరించినారా?

విలాస:—ఒకయక్షరము గట్టిగనంటివో ప్రాణాంత్యమే యగును. ఈపిల్లఁజూగ దాని. భలేఁ పనసొమ్ము లిచ్చునటుల చేయవలెను.

(భామిని భీతిల్లియాటులనే నిలిచియుండును. విలాసధరుఁడు లక్ష్మీధరునకుఁ సన్న చేయును లక్ష్మీధరుఁడు వడఁకుచునిలిచియుండును. ఇంతలోనె నిజముగ దొంగలువచ్చుచున్నారు)

1. దొంగ:—భళిరా. భళిరా. మంచిమృగమును వెదకితిమి. ఇదయొకవేళ నఱచును. నోటిలోబంతి పెట్టుఁడి.

2. దొంగ.—దానికిభయపడియారయేమి నీవుస్తబ్ధుఁడవై నిలిచినావు? వానిపని మొదటఁబట్టింపవలెను.

3. దొంగ:—ఒరే! సొమ్ములెన్ని ధరించినాఁడు?

5. దొంగ:— నూరారువ్వురు స్త్రీలను గొల్లగొట్టినను నిన్నిసొమ్ములుఁ దొరకవు. ఈవిధవదేహమున నెన్ని యున్నవియో?

లక్ష్మీధర:—నూరారెంటితే. నా గ్రామములోని సకలస్త్రీలకునయి మిగులునన్నినగలు నా యొక్కని వద్దనే యున్నవి.

1-దొంగ:—(దొంగలిరువురనిఁజూచి) మీరీ యిరువురినిఁ బట్టుఁడి. నేనాపిల్ల దానివద్ద నేమియున్నదియో శోధించెద.

లక్ష్మీధ:— ఏమండీ విలాసధరగారూ! విలాసధరుగారూ! మీరు నిజమగు దొంగలు. ఇపుడు నాగతి యేమి? ఈ కత్తిఁ దీసికొనుము. నారక్షణకు నెపట్టినను బయిగిడిరండు. (కత్తిపాఱ వేయును )

1-దొంగ:—విలాసధరుఁడెవఁడు? వాఁడు మావారిలో నెవఁడును లేఁడు. వానిని మొదటఁ బట్టికొనుఁడి.
(విలాసధరునిఁ బట్టికొందురు. ఇగ్గి యీడ్చుటలో వానిగడ్డము పడిపోవును. మిగత యిరువురు లక్ష్మీధరునిఁ బట్టుదురు. అచటఁ బడిన కత్తినిఁదీసి చేతనిడికొని భామినివాకిలి వద్ద నిలిచియుండును.

విలాస:— (స్వగతము) బుద్ధిలేనిమిత్రుఁడు ప్రాణముదీయును

భామిని:— కుసుమా! వినోదా! లెండి. హెచ్చరిక. వెనుకటివాకిలినుండి పఱుగిడి కావలివాండ్రను పిలువుఁడి. దొంగలు పడినారుసుండి. కుసుమా లెమ్మా. పఱుగిడుము. (ఇరువురుదొంగలు విచ్చుకత్తులతో భామినియెదుట నిలుతురు.)

1-దొంగ:-- ఒకమాట వినుము. ఇంతవఱకుఁ జడిపితిమి. ఈ ఖడ్గమునకు బలియియ్యవలసివచ్చును.

భామిని:— నా చేతికత్తిచే మీలోఁ గొండొకని బలియిచ్చినపిదప మీ కత్తికి నేను బలియగుదును. కుసుమా! వినోదా! (యీ శబ్దములు గట్టిగఁబలుకును) (పనివాండ్లారా! తోఁటకాపరులారా! కావలివారా! పఱుగిడి రండి పఱుగిడుఁడి. చోరులు మా తోఁటలోఁ జొచ్చినారు. పఱుగిడి రండి. పఱుగిడ రండి.) (వినోదుఁడు వచ్చును.)

వినోద:— (తనజుట్టుఁ దానే పట్టుకొని) ఆహా! పఱుగిడుఁడి మాయింటిలో దొంగలు పడినారు. నా శిఖను బట్టి నన్నీడ్చుచున్నారు. పఱుఁగిడుఁడి. పఱుఁగిడుఁడి. ఎవరయినను నన్ను విడిపింపుఁడి.

(వెళ్లును.)

1-దొంగ:-- ఇదె చూడుము. ఇపుడు నీకిక సాహాయ్యము వచ్చులాగుననున్నది. మీరు వారిరువురిని నారి చెట్టుకుఁ గట్టుఁడి. మేమిరువురము దీనిని మా ఖడ్గముల నడుమ నుంచెదము. దీనిని చెట్టునకుఁ గట్టుఁడి. వారి శరీరాభరణముల భద్రము చేయుఁడి. సాహాయ్యము రాకమున్నె యెన్నినగలైనను దీసికొనఁజూడుఁడి. (లక్ష్మీశ్వర విలాసవరులను చెట్టునకుఁ గట్టి వారి సొమ్ములు గుంజి వేయుదురు.)

3-దొంగ:-- ఏమీ శ్రీమంతులు సుఖములసొక్కి సోమరిపోతులయినారు. సొమ్ములు విచ్చను సాహాయ్యపడినచో వారి చేతులు నొచ్చునేమో?

4-దొంగ:-- ఆఁడువారుగ నుండినయెడల వారికి శ్రమయిచ్చునది లేదు. ఈ దుర్మార్గులు తమచే సొమ్ములు విప్పి యియ్యరిమ్మా.

లక్ష్మీ:— కొట్టవలదు నే నెప్పుడు నా భామినిబలె నష్టగించువాఁడను గాను. నన్నేల యీలాగున కొట్టెదవు? ఆభరణములన్నియును గొమ్ము.

1-దొంగ:-- అన్ని సొమ్ములు నొక్కచోట రాశిగఁ గూర్చుము.

2-దొంగ:-- నేఁడు మాకు మంచిముహూర్తము దొరకెను. సూర్యపేటికలు విఱుగఁగొట్టినను నింతటి ద్రవ్యము చిక్కుచుండలేదు. అంతయు నొక్కతూరిగ వచ్చెను.

4-దొంగ:-- అంతయుగాక భారవాహకుల భారము తక్కువాయెను.

3-దొంగ:-- (అన్ని నగలను జేర్చి) అచట నచట నిండిన సంపదయంతయును నొకచోటఁ గూర్చి పరాక్రమవంతుఁడు తన స్వాసకు నీడ్చికొనిపోయి శ్రీమంతుఁడగును. పిదపఁ బరమేశ్వరుఁడు సృజించిన యిట్టి మంచి గాడిద శ్రీమంతుని పుత్రుఁడయి దానినందును.

భామిని:— ఓరీ! మీరు నిలువుఁడి నిలువుఁడి. ఈ తోఁటలోనున్న యింటిలో దొంగతనముఁ జేయవచ్చినారా?

దొంగ:— అఱవుము. చేతనైనంతవఱకు నఱవుము. మావనిముగియ వచ్చినది. ఏమో కాలి చప్పుడి యగు చున్నది! సాహాయ్యము వచ్చెనాయేమి? మేమును బఱుగిడుదుము.

( ఒకదిక్కు శీలధరుఁడు రెండవదిక్కు ధైర్యధరుఁడును వత్తురు )

ధైర్యధ:—ఇపుడెనటికిఁ బఱుఁగిడుదురు? ఈకత్తిమీరక్త పానమొనరించిన పిదప మీయొమకలీతోఁ టలోనుండి వెలికిఁబాఱ వేయుదును.

( అందఱు యుద్ధమొనర్తురు. ) వనమాలా! వలదు. వలదు. యుద్ధశ్రమనీకు నేనిడినరొండల మాచేతిలోని ఖడ్గమేల? (యుద్ధమొనర్చు చుండ గావలివారందఱును వత్తురు, దొంగలను బిడిరెట్టలు గట్టుదురు )

ధైర్యధ:-- శీలధరా! ఈదొంగలను నీవుదీసికొని వెళ్లి చెఱలోనుంపుము.

( శీలధరుఁడు చోరులను దీసికొని పోవును. )

లక్ష్మీ:— ఈపిఱికి పోటులనిచ్చి కొనిపొండి. ఈదుష్టుల కెంతగర్వము. విలాసధరుగారూ! తమభవిష్యత్తు, ధైర్యధరుఁడు నిశ్చయపఱచెను.

ధైర్యధ:-- ఎవరు? విలాసధరగారో! ఎవరు? లక్ష్మీధరుగారో? ఈదొంగలుమిమ్ము బంధించిరియా? ఇప్పటికి మాసేనలో మిముఁ బోలువారున్నారనికదా దొంగలకు ననుకూలము దొరకుచున్నది. వనమాలా! వీరుగొప్ప గృహస్థులుగనున్నవారు. లక్ష్మీపుత్రులని పేరుపొందినారు. వీరిని జాగ్రత్తగ వారి శిబరంబులకుఁ బంపవలెను. వారినిఁ జక్కఁగ విడిచిరాను కావలిగాండ్రను బిలిచికొని వచ్చెద. అదివఱకు నీవు వీరిపై జాగ్రత్తగ నుండుము.

(వెళ్లును)

భామిని:—లక్ష్మీధరుగారు! విలాసధరగారూ! మీరును దొంగతనమును జేయను నాయింటికి వచ్చితిరియా? ఉండును. ఇదిధైర్యధరునకుఁ దెలియదు.

లక్ష్మీ:—అదిఎటుల వానికిఁదెలియును? మేమిరువురునుఁగూడి యీయుపాయము పన్నితిమి. వానికిదిఎటుల దెలియును?

భామిని:—మీయుక్తి ధైర్యధరునకు నేఁదెలుపఁగూడదనిదియని మీయిచ్ఛకాఁబోలు.

లక్ష్మీ:— నిజము. అదే మాయిచ్ఛ.

భామిని:—అయిన మీరు నా సాహాయ్యమునకునై వచ్చియుండ దొంగలుమిముఁ బట్టిబంధించిరని:—

విలాస:— అటుల ధైర్యధరుఁడు తెలిసికొనులాగు చేయుము. మేము దోవలోఁ దిరుగుచుండ, దొంగలు కష్టపెట్టి యాకస్మికముగ మమ్మునిశ్శస్త్రులనొనర్చిరి. మఱియునిచటికిఁ దెచ్చికట్టిరి. ఉపాయములేక పోయినందున నీదుర్దశ వాటిల్లెను. ధైర్యధరుఁ డీరీతిఁదెలిసికొను లాగునఁజేయవలెను. భామినీ! నీయక్క నాభార్యకావున, దానిసంసారనాశనము జేయుట నాచేలోనున్నది. ఇదిమఱవకు. నేనెటు చెప్పితినో యటులనే ధైర్యధరుఁడు తెలిసికొనఁ జేయవలెను. లేనియెడల—

భామిని:—నీ యట్టిబెదరింపులకు నేనుభీతిమిడు దాననుగాను. నీదిగాని మఱి యెవరిదుర్యాదగానీ తీయుట నాయిష్టముకాదు. అకారణమున నీవుచెప్పిన ప్రకారము ధైర్యధరునకుఁ దెలిపె దను. నేను భామినియని వానికిఁదెలియ నీయకుఁడి. నాయిప్పటి పేరు సునమాలి. ఇదిమన మున నుంపుము.

విలాస:— సమ్మతి. నాకది సమ్మతి.

లక్ష్మి:— ఈయేర్పాటు చక్కఁగ నున్నది.

భామిని:—ఏర్పాటేమి? అందుల కొడంబడి కలేమి?

లక్ష్మి:— కాదు. తప్పు. తప్పు. నీదాసులము మేము. ఈబంధమునుండి మమ్ముఁ దప్పించుము.

లక్ష్మి:— చ. " శరణని వేఁడువాఁడనిసు సాహసలోచన, నన్నుఁగ్రోవవే
" త్వరితముగా! నుతించెదనసదానిసు, సేఁకురీతిఁగొల్చెదన్

భామి:— " నరవరవీరు, ధైర్యధరుఁడన్నుత వేఁడుము బంధముక్తికై

లక్ష్మి:— " చరణములంటి వేఁడెదను సంకటములో వదలింపుమాసతీ.

భామిని:— అటుదూడుము. ధైర్యధరుఁడు వచ్చుచున్నాడు. వానికిదిన్నవించికొనుము. అటులైన నీ సొమ్ములన్నియు నేమియుఁ బోవు. మఱల నీమర్యాదకు లోపమునుండదు.

విలాస:—వలదు. ఇప్పుడేమనుఁ బోనిమ్ము. వానికినీవెటు తెలుపవలెనో యటు తెలుపుము. మామ ర్యాదకాపాడుము లక్ష్మీధరా వెళ్లుము. ధైర్యధరుఁడు రాకమున్నే మీముఖమున, మసి పూసికొని వెళ్లుఁడి. నావెంటరండు.

లక్ష్మి:—అయిన నాసొమ్ములు నేనవిడిచికొనిపోనగునా?

భామిని:—ధైర్యధరుఁడు వచ్చిన పిదపవాని యానతినంది పొండి.

విలాస:—వెళ్లండి. నగలవిషయమేమిపెట్టికొని కూర్చున్నారు?

లక్ష్మి:— నిలువుఁడి. ఇంచుకనిలువుఁడి. ధైర్యధరుఁడురానిండు వానికిఁ గేలుమోడ్చెద. కాళ్లపట్టి కొనియెద. శరణనివేఁడి సొమ్ములనిప్పించికొనియెద.

విలాస:— వెళ్లండీ. కాళ్లేలపట్టికొనెదరు? సొమ్ములనేలయడిగెదరు? సేనాధిపతినుండి యా సొమ్ములు మీకువచ్చునని తలంచితిరియా?

లక్ష్మీధర:—కంకణములు ధరించినచేతులతోఁగాళ్లుపట్టుకొనినయెడల, ధైర్యధరుఁడుగాని, యితరసేనా పతిగాని, దయ్యముగాని దయనుబూనుదురు. ఏమండీ! మముఁబోలువారి శ్రీమంతత్వము స్త్రీ లబలెసొమ్ములు ధరించిచూపుదుము. ధైర్యధరునంతటి శూరులుదయాభరణము దేహముపై వేసికొని యంతటను దానిప్రదర్శనముఁ జేయుటయె గొప్పతనమని తలఁచుచుందురు. అడిగికొ నిన దేవుఁడును భక్తులపైదయఁజూపును. అనఁగా నేను వానికాళ్లపైఁబడి నాసొమ్ములు.

విలాస:—వెళ్లండీ; ఇంతటి యవమానముచాలదారేమి? వెళ్లుఁడి మూకిబలె నావెంట (లక్ష్మీధరుని నీడ్చుకొనిపోవును.)

భామిని.— ఈ లక్ష్మీధరునకు ద్రవ్యము దప్పమఱియేమియుఁగనఁబడదు. నాకనటులనే యగపడుచుండలేదా? నేఁడు నాలోచనములకు ధైర్యధరుఁడంజనము వేయఁగా నాకన్నులు నిర్మలినములయ్యెను. లక్ష్మీధరుఁడనిసరీతిగ దైవము భక్తులకు నిచ్చితీసికొనుటకునై యెంతదయఁ జూపుచున్నాఁడు! దయయుఁబ్రేమయునతని వస్తువులయి వెలయుచుండును. లేనియెడల నేఁటి వఱకు భామినీ నీ ప్రేమకు వెలయిరువదిమలక్షలయి ప్రఖ్యాతికెక్కియుండెనుకదా! ఇన్ని దినములు ప్రేమకుఁగలవెల నేనుగుర్తించియుండలేనుకదా? బాజారువస్తువుల కెటు వెలకట్టుదురో యటులనే నాప్రేమకు నైకమిన్నిదినములు వెలఁగట్టుచుండిరి. రిత్తప్రేమయు రిత్తదయయును నెవరు నిచ్చితీసికొనఁజాలరుగదా? కారణమేమన, దయయుఁబ్రేమయు శాశ్వత సుఖాలవాలముగనుండును. వానియందే యానందము నిండియుండును. ప్రేమయుండు తావున లోభమునకు నెట్టియాస్పదమును గలుగఁగూడదు.

ఉ. నిజమగు ప్రేమ, లోభగుణనిష్ఠురమైనది కాదు, భానుఁ డ
క్కజముగఁ దప్పఁడైన, జనకాండమునుండి జలజాతజాతముల్
నిజగుణమైన ప్రేమను, బుసీతులఁ జేయును గాదె? యట్లులే,
భజనయొనర్పఁగల్గుఁగద బంధురప్రేమ, పదార్థకల్పనల్.

(ధైర్యధరుఁడువచ్చును.)

ధైర్యధ:— విలాసధర లక్ష్మీధరులు వెళ్లిపోయిరా యేమి? ఈ కాపలివాండ్రనురిత్తగఁ బిలిచికొనివచ్చితిని. [వారితో] వెళ్లుఁడు మీపనికి. వారు నాకుగా నేలనిలువఁగలరు? నేను వారినించుక విచారింపవలసినదిగనుండెను. ఈ శిబిరస్థలములందు వారెవరయినజ్ఞనంది రాత్రులు దిరుగుచుండిరి? రాత్రివేళఁగాపలికిఁగాను నేను వారిని నేమింపలేదు. వారెటులిట్లువచ్చిరి? వనమాలా! నా మనమునందొక సంశయమున్నది. నిన్ను నేనొక ప్రశ్నయడుగనున్నాను. నిజమగు నుత్తరముఁ జెప్పెదవా?

భామిని:— విచారింపఁదగిన ప్రశ్నయేది?

ధైర్యధ:— (స్వగతము) నాకుగొప్పసంశయము కలిగెను. ఈ శ్రీమంతులు రణమైదానములో నైతమీ రీతిగనలంకరించుకొని వచ్చుచుందురు. అందులో నేమియు నసంభవము లేదు. అందుకుగాను ప్రతిరొక్కనిని శిక్షించినాను. అయినను వనమాలికి నీ మాటలుతెలియునని నేఁదలఁచి యుండలేదు.

భామిని:— [స్వగతము] నేను భామినియని వీఁడు గుర్తింపలేదు [ప్రకాశము] విచారమేలచేయుచున్నారు. ఆ ప్రశ్ననడుగవచ్చును.

ధైర్యధర:— [స్వగత] దీనికిని వారికిని సుఖసంబంధవిషయమేమి యున్నట్టులేదు. అటులుండినయెడల నామనము దీనిపై సంతగనీడ్చుచుండలేదు. (ప్రకాశ) ప్రశ్నయననిదియేను. వారిచటఁజోరులబలె బంధింపఁబడిరెటుల?

భామిని:— చోరులువారినిచటకి మోసికొనివచ్చిరి. విలాసధరుని చేతిలోఁగత్తియుండలేదు. లక్ష్మీధరుని

చేత నుండెను. అది క్రిందఁ బడెను. నే దానినెత్తికొంటిని. ఇదిరత్నవాసికత్తి. దీనిపిడిపై విలాసధరుని నామమున్నది.

ధైర్యధః— నీవువారి నెఱుఁగుదువా?

భామినిః—ఎఱుఁగుదును. వారుమాత్రము వనమాలి నేనని తెలియరు.

ధైర్యధః—(స్వగ) నాదివ్యర్థ సంశయము.

భామినిః—(స్వగ) నే భామినియను సంశయము వీరిమనమునఁ బుట్టినదికాదు.

ధైర్యధః— విలాస ధరునిగుఱ్ఱ నీకెచట కలిగెను?

భామినిః—మాతోఁట వారి యినాము భూమిలోనిది.

ధైర్యధః— ఈరాత్రిలో వారిచటికి నేలవచ్చి యుందురని నీవుతలఁచితివి?

భామినిః—లక్ష్మీధరుని నడవడిక మంచిదికాదని యనికొనుచున్నారు. విలాసధరుఁ డించుకవాని మిత్రుఁడేను. రాత్రివేళ హెచ్చరిక లేక రెచ్చటనో పోవుచుండఁ జోరులు వారికి గంటుపడిరని నాకుఁదోఁచు చున్నది.

ధైర్యధః— అటుల నే యుందును. ఈ ప్రకారము సేనలోనడవఁ గూడదని నేనెన్ని మాఱులో యుత్తరువుచేసినాను. రేపు ప్రాతఃకాలముననే వారినిఁ జక్కఁగ విచారించి సేనాధిపతుల సంఘము నుండి వారినిఁ ద్రోసివేయుదును. వనమాలా! నీయంతటి శౌర్యసాహసములైనను వారికి లేకపోయెను. అట్టివారు మాసేనయం దుండనేల? ఈ రాత్రి యా భీరువులకుఁ దరవారి లేకపోయినను నీకు నుపయోగపడెను. నేఁడు శూరపురుషునిరీతిగ నీవు దొంగలను శిక్షించుటలోఁ గృపాణ ముపయోగించితివి. వనమాలా! సేనాధిపుల సంఘముల నుండి యా యిరువురి భీరువుల పేరులు తీసివేయుచు నీపేరందుఁ జేర్పవలెనని నాకుఁ దోఁచెడు. మఱియు దొంగలు కొల్లగొట్టిన సొమ్ములు రాజునకుఁ జేరినవి. పృథ్వీవర మహారాజుగారి హస్తమునుండి వానిని నీకు బహుమానముగ నిప్పించెద. ఈ నగలుగనుము. ఇవి నీకుఁదగినవికావా? మంచి యమూల్యములైనవి. శ్రేష్ఠతమములగు మణుల యాభరణములు గొన్ని యొపరివద్దనైన నున్నవియాయనిన లక్ష్మీధరునింటిలోనే యట్టివి కలవని ప్రఖ్యాతి. ఆ భీరువు నేఁడందులో శ్రేష్ఠములైన నగలు ధరించినాఁడని, నాకుఁ దోఁచుచున్నది. చూడు మీ నగలు శ్రేష్ఠతమములుగనున్నవి. వనమాలా! కొల్లగొట్టినసొత్తులు రాజభాండాగారము జేర్చుటకును నితరవిధముగ నుపయోగించుటకును సేనాధిపతికి స్వాతంత్ర్యమున్నది. వనమాలా! నేటి నీ శౌర్యమునకు బదులీ నగలు,.........పృథ్వీవర మహారాజునుండి బహుమానమిప్పింపవలెననుకారణములేదు. నేనే వానిని నీకు బహుమానమిచ్చెద.

భామినిః—మహారాజా! నాకీనగలు వొత్తిగవలదు. నే నడవిపాలములలో నుండుదానను. నాకేల యీ నగలు. నా మనము సొమ్ములను ధిక్కరించుచున్నది.

ధైర్యధః— వలదనుట కలదు. స్వీకరింపుమీనగలను. లక్ష్మీధరునకు నివియొప్పవు. నినుఁబోలు ధీరకన్యకే వానిని స్వీకరింపకయున్న నది ధన్యతనొందునది యెటులు? చంచల లక్ష్మికిఁ గలకళంకము

నీవుఁబోలు నాభరణేచ్ఛలేని ధన్యస్త్రీల సహవాసమునఁగదా మాసిపోవును. వీనిని స్వీకరించి పవిత్రతనందఁజేయుము. ఈ లక్ష్మీదేవి స్వీకరింపుమని నీ దిక్కునఁ జూచుచున్నది. దానిపై దయఁజూపుము. దూరముపోవలదు. శరణన్నవారిపైఁ గరుణఁ జూపవలెను.

చ. శరణను దీనసేవకుల సంకటదూరులఁ జేయఁగాఁ దగున్,
నిరతము పంకసంకలిత నీరమునందలి పంకజాళి, వి
స్తరసుఖులంది సూర్యుఁడవె సంతసమందఁగఁజేసె వానికిన్,
గరివరకష్టముల్వినుచుఁ గాఁచెనుదైవము నాఁడు వేఁడినన్.

కావున, వనమాలా! యీ నగలను గొనుము. వానినుండి దూరముపోయెదవా? ఆఁడువారాభరణముల నింతగ ధిక్కారబుద్ధినిఁ జూచుటఁ బ్రారంభమున నేను నేఁడే చూచితిని. వనమాలా! దొంగలనుండి మిమ్మునెల్లర విడిపించితిని. అది నా విధ్యుక్త కార్యము. నా కార్యము నీవించుక యొనరించితివి కావున నేనిపుడిడు స్వల్పబహుమానమును నీవు స్వీకరింపుము.

భామిని:—మహారాజా! నేనీనగలను స్వీకరించెదను. అయిన నే వేఁడు మూఁడువరములు నాకునిడవలెను.

ధైర్యధ:—నీ సకలేష్టములు నే నొనఁగూర్చెదను. తెలుపుము. ఏవరములవి?

భామిని:—విలాసధరుని యొక్కయు, లక్ష్మీధరుని యొక్కయు, నామము లధికారుల పట్టికలోనుండి త్రోయింపుము. నా పేరుఁ జేర్పకుము.

ధైర్యధ:—ఇది విలక్షణమైనదియ. మఱియొకటి?

భామిని:—ప్రస్తుత యుద్ధములోఁ జనిపోయినవారి భార్యాపుత్త్రు లనాథలగుచుఁ గుందుచుందురు. ఈ నగలన్నియును విక్రయించి వచ్చినద్రవ్యమునుండి యట్టి యనాథలను రక్షింప నాకు నాజ్ఞ యిడవలెను.

ధైర్యధ:—వనమాలా! ఈ కోరికచే నీవు ధైర్యధరుని సైతము లజ్జింపఁజేసితివి. ముందువరమెద్ది?

భామిని:—నా మూఁడవకోరికయిది. మీరు నేఁడు నాకొనరించిన యుపకారమునకుఁ బ్రత్యుపకారము పుష్పము లేకున్నను నిప్పుడిత్థమైన నిచ్చురీతిగ నా చేతిలోఁబడిన యీ తరవారమును మీరు స్వీకరింపవలెను.

ధైర్యధ:—వనమాలా! స్త్రీలు నగలకును రణశూరులు కృపాణమునకును నాశపడుట సహజము. నీవు నగలయాసవదలితివి. నీవలెనే నేనును కృపాణాపేక్ష వదలవలసినదిగ నుండెను. అయిన నా స్వభావము దాని నపేక్షింపఁ జేయుచున్నది. అదిగాక, యిది నీచేతి బహుమానము. నేనెటు నిరాకరింతును? ( ఖడ్గము స్వీకరించును )

భామిని:—ఈకృపాణమునకింక నెంతటిశోభ కలుగునోకదా? నాచేతిలోనది యెటులనోయగ పడుచుండెను. ఏమండీ! ఈనగలు లక్ష్మీధరుని దేహముపై నేఁజూచియుంటిని. ఒకకృపాణమునుండి పురుషుని రూపమెంతగఁ బ్రకాశించునో, యంతగ నీభూషణములకన్న [illegible]గులు భూషణములు ధరించినను బ్రకాశింపవని నేఁదలంచెద.

చైత్యధః:— వనమాలా! ఈనగలిచట నే యుంచవమ్మా. పృథ్వీధర మహారాజుగారి చెవులలో నీవృత్తాంత మించుక వేసి యీనగలకంటెను రెండంతలు వెలగలనగలు పరోపకారమునకున్నై నీకు బహుమానమిప్పించెద. అదివఱకు నీసొమ్ములిట్టులనే నీవద్దనుండని. ఇంటిలోనికిఁ గొనిపొమ్ము. నీవు క్షేమముగ నింటిలో నిద్రపొమ్ము. అంతవఱకుండి కావలి వారుండఁదగినయింటి నిచటికి మార్చెద. (వెళ్లును)

ఉ. సంగరమున్ భజించు పరసాహసితా నపురుండుగాఁడె? సా
రంగవిలోలలోచన నిరంతర సేవ్యుఁడుగాఁడె? కన్నులా
రం గని యీసభామణి కరంబిదె నాపయిఁ బ్రేమ; యెంతయో
యంగన మెప్పుఁగన్న నరుఁ డన్ని శుభమ్ములఁ గాంచునెన్నఁడున్.

భామిని:—( పోవువానిఁ జూచుచు స్వగతము )

క పౌరుష సహితుండౌ పురుషుఁడు
నారులకును మారుఁడగుచు, నవనాథుఁడగున్
పౌరుష హీనుఁడు పురుషుఁడు
నారులకును దూరుఁడగుచు, నవనారియగున్.

( నిష్క్రమము )



# మా నా ప మా న నా ట క ము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

### అక్కాసాహేబు సౌధము.

( అక్కాసాహేబు - వినోదుడు కూర్చుండియుందురు. )

వినోద:— అక్కాసాహేబుగారూ! విలాసధరుగారు కొల్లబోయినవార్త నేనేమని తెలుపఁగలను? మంచిదారిపోయినాఁడు. నాకన్నిపై నేమియునుండలేదు. జుట్టుముడి నేనేపట్టుకొని పఱుగిడితిని. కానిచో విలాసధరునిఁ జెట్టునకుఁగట్టి దొంగ లెటు బాధించిరో యటులనే యీ వినోదునకును నగుచుండెను. దెబ్బలుతినిన విలాసధరుఁడు గట్టివాఁడు కావున జీవమునవచ్చెను. అమ్మా! నాకు నారీతిగ దెబ్బలు పడియుండిన యెడల నేఁడు నేను మీ దృష్టిలోఁ బడుచుండలేను. ఛీ ఛీ! ఛీ! చెట్టునకుఁగట్టబడి యెన్ని బాధలుపడిరో! ఎనిమిది దినములయినను నేఁటికిని కలఁచుకొనిన నాకెంత మోసనికలుగుచున్నది. అక్కా! మాటలాడు బలముచే నా నాలుక యాడుచున్నది. చెట్టునకు బంధింపఁబడిన చిత్రరూపము నాయెదుట నగపడుచున్నది. ( విలాసధరుఁడు ప్రవేశించును ) మహారాజుగారు తామేవచ్చినారు. వారిద్వారానే సకల సంగతులు విచారింపనగును. నా నాలుక నిలిచి పోయెను.

విలాస.— ఏమిరా! ఏవిషయమునుగుఱించి.

వినోద:— మహారాజా! నేఁ జెప్పఁదగినదికాదు. అమ్మా! నే వెళ్లను సెలవిమ్మ. లగ్నసమయములందుఁ దప్ప నితరవిషయములలోఁ గొప్పవారెటుల చతుర్భుజులగుదురో యావిషయము ననుబోలు పేదవారు తెలుపుట సమంజసముగాదు. కావున సంగతులు తెలుపువారే చతుర్భుజులైన విషయముఁ దెలిపెదరు. ( వెళ్ళిపోవును. )

విలాస:— ( స్వగత ) నిన్న భామిని మఱలివచ్చినది. చోరులు నన్నెటు బాధించినదియు నాదిక్కున నే చూపుచుఁ దెలియఁజేసి నట్టుగపడెదు. ధైర్యధరుఁడు భామినిని లగ్నము చేసికొనక యుండునట్లాగొనర్చినయెడల మోమున కంటినమసి పోవును.

అక్కా:— వినోదుఁడు చెప్పినవార్త మీరు వినలేదని తోఁచుచున్నది.

విలాస:— ( స్వగత ) ఇపుడాఁడువారినుండి యప్రతిష్ఠయగును. ( ప్రకాశ ) వినోదుఁడేమిచెప్పెను? భామిని యేమిచెప్పునో వినోదుఁడది పలుకును. వినోదుఁ డేమిచెప్పెనో దానినే నీవు పలవరించుచుఁ గూర్చుండెదవు. నిజముగ దొంగతనమునుగుఱించి భామిని యెన్నియో ప్రగల్భములు పలుకుచుఁ బ్రకటించుచున్నది.

అక్కా:— అటులైన తమగొంతులోని ముత్యాలహారమేదీ కానరాదు.

విలాస.— దానిని దొంగలుతీసికొని పోయిరి. నేనే సకలము నీకుఁ దెలిపియుంటిని. భామిని నీకేమి యధికముగఁ జెప్పెను?

అక్క:— అధికముగ నేమిచెప్పెనో తెలుపుదునా? అటులైన మీ గుడ్లెఱ్ఱగఁ జేయుదురేమో? చోరులు చక్కఁగఁ బ్రాయశ్చిత్తమొనర్చిరని భామిని తెలిపెను.

విలాస:— దేనికిమాఱుగ?

అక్క:— దొంగతనముగ రాత్రులు సంచరించుపద్ధతి యిచటనున్నదని నాకుఁ దెలియును. కత్తిసైతము లేక యపరాత్రిలోనే దయ్యము మూతిచూడను వెలికి వెడలియుంటిరి?

విలాస:— ( స్వగత ) భామిని నా యవమానమేమియు వెలివేసినది కాదు.

అక్క:— ఇపుడేమి చెప్పుదును? ఏమిచెప్పకయుండుదును? ఇంతటి పట్టణములోనుండు వారెద్దియో యొక నవీనవిషయమని యాఁడువారిని మోసగించిపోవుట యున్నదియగదా? నేఁడు లక్ష్మీధరుగారి యింటిలో గానసభ, రేపు నూతన నాటకమునకుఁ బిలుపువచ్చినది, యీరీతిగఁ బలికి నాత్రి రాత్రులు వెలిగ సంచరించుట శోభిల్లుచున్నది. నాటకములుండనీ లేకపోనీ యేదేశమునుండియో మంచి నాటకమువారు మనపట్టణమందు దినదిన మాడుచున్నారను నది మగవారాడుట వినునది యాఁడువారి భాగ్యమైనది. అటులైనచో, సకలనాటక సంఘమువారిని గాన సభవారిని నిస్సంతానులఁ జేయుమని మృత్యుదేవతను స్త్రీలందఱు వేఁడవలసివచ్చును.

విలాస:— ఏమే! యటులైనచో నాటకము వారిపైనఁ గావలిగ స్త్రీలు తిరుగవలసివచ్చును. భార్యాభర్తలిరువురు నింటిలోనైన నుండవలెను, కాదా యిరువురునుఁగూడి వెలికైనఁ బోవలయును తుదకు రెండును లేకమేను.

అక్క:— ఒకరిపై నొకరు కావలిగ నుండుటకంటెను, మొన్న చోరులనుండి యెటు ప్రాయశ్చిత్తమాయెనో, యటులనే, రాత్రులు నపరాత్రులును సంచరించువారికిఁ దప్పక ప్రాయశ్చిత్తము చోరులు గావింతురు గాతమని స్త్రీలందఱు దొంగలను దీవించుచుండవలసివచ్చును. సజ్జనులకు భీతి గలిగించుటకంటెను, మేడలు దాఁటువారిని మిద్దెలెక్కిదిగువారినిబట్టి దొంగలు రుమాళ్లుగర వేసిన బాగుగనుండును.

విలాస:— ( కన్నులు మూసికొని స్వగతము ) మేడలమీది దొంగల రుమాళ్లు దొంగలించువారున్నఁగదా?

అక్క:— ఏమి కనుఁగవమూసినారు? నామాటలు కఠినమని దోఁచెనా? ఆ సమయమునకైనయవమానముఁ గప్పివేయు నెపమా? ఆఁడువారు చెవులుపిండుట తమకువలదని లోఁచెదు. కనుఁగవ మూసికొని పైనఁ బైన మఱల నిరుపద్రవ తాపసులఁబలె నటించు వేషధారుల కనులకు నాఁడువారు కలికము వేసినఁగదా శుద్ధియగును. చెట్టునకుఁగట్టు దొంగలును దారిదోపుడు గాండ్రును నుండఁజూడవలెను. మోసమయమగు జగత్తులో వారుంటయు మిక్కిలి యుపయోగముగ నున్నది.

చ. ధనమదముల్ హరించి నిరతం బుపకారము సేయువారు, ని
ర్జనతలవాసులై కలుషజాలుర చేవ నడంచువారు, భూ
జనగురులోభమూలధనజాలములెల్లఁ బెకల్చువారు, ని
ర్ధనులయినన్ మహోపకృతి సల్పసమర్థులు, చోరులీధరన్.

విలాస:— ముగిసెనా? ఇంకనుముందేమైన నున్నదియా? నాకునిందుకె తెలుపుము.

అక్క:— నాది ముగిసెను. ఇంకమీఁద మీరువేఁడుఁడి.

విలాస:— నా వేఁడుట యిదియె. మగనియవమాన మిటులయినచోఁ బ్రసక్తిలోమఱల రానటులుండును. ఇదియె నేఁ వేఁడుట.

అక్క:— వేఁడుట యననేమి?

విలాస:— చోరులునన్ను చెట్టునకుఁ బేఁడిన పగ్గమునఁ గట్టిరి. అటులనే నేనునిన్ను నా పేఁడిన పగ్గమునఁ గట్టనిష్టపడను. ఏవిషయమున నీవు నాయందు దోష మారోపించితివో దానికి నే యాధారమును లేదు. నే నపుడే లక్ష్మీధరుని రమ్మనిచెప్పి వచ్చినాను. అతఁడపుడేవచ్చి నా మేడలోఁ గూర్చునియుండును. వానినిఁజూచి నేనుదొంగల విషయమును దెలిపెద. నీవే వారిని విచారించి నిజమెద్ది యబద్ధమెద్ది యనునది నాసమక్షమునఁ బరీక్షింపుము. భామినిని లక్ష్మీధరునకిచ్చి లగ్నముచేయింప వలెనని నీయిచ్ఛ యుండెనుగదా? ఈలగ్నమునైనఁ గుదుర్పుమని నీవేనాకుఁదెలిపి యుంటివికదా?

అక్క:— నిజము. ఎవరు లేవను చున్నారు? నేఁడుభామిని శిబిరప్రాంతము నుండి తిరిగివచ్చినది. ఇపుడు ధైర్యధరుని కంఠములో, హారముచేయ నుత్సుకురాలైనది. నాకునిప్పటికిని తోఁచున దేమన, భామిని లక్ష్మీధరునే పెండ్లిచేసికొనిన బాగుగనుండును.

విలాస:— నీయొక్క యీపనికైగదా నేఁబోయి చోరులకుఁ జిక్కికష్టబడితిని.

అక్క:— అనఁగానది యెటుల?

విలాస:— సర్వమును లక్ష్మీధరుగారినిఁ జూచి వారియెదుటఁ జెప్పెదను. అటులైన నీకునిజము తట్టును. నేనిపుడింతయు తెలుపఁదగినదిగ నున్నది. నీమగని యీయవమాన కారణమెద్దియో యాకృపాణము నుపయోగించుటలో నేను ధైర్యధరునకంటెను దక్కువయనికాని నేనుమఱి యేచింతలోనుండి వానిచేమోసపోతి ననియుఁ దెలియకుము. నే నేదినమున ధైర్యధరునకును భామినికిని గాఁదగిన పెండ్లినిలిపి నేనువానిఁ జూచి నవ్వితినో, యాదినమునుండియును దానిని మనమునునుంచికొని సేనాపతియనెడి యధికారమును దురుపయోగపఱచి, యాదరిద్రుఁడు, చోరులకుఁ దెలిపి వారిద్వారానాకు నవమానముగావించెను. వానినీచత్వము పూర్వమునుండియు నాకించుక తెలియును. చోరులసమముగ ధైర్యధరుఁడును, భామినియెదుటఁ జెట్టునకుమమ్ముఁ గట్టించెను. తలఁచి నపుడంతయును దేహమగ్గి యగ్గిగ మండుచున్నది.

అక్క:— ఇదియంతయును నిజమేనా? భామిని, యాశవమును గుఱించి స్తుతిస్తోత్రము లెప్పుడును బాడుచుండును.

విలాస:— ఆమాటవిని నాకలజ్జయగుచున్నది. వానినీచత్వముఁజూచి భామినికిఁ గోపము వచ్చునని తెలిసియుంటిని. అదివదలి వానిపైమరులుగొనినటు లగుపడుచున్నది.

అక్క:— నిజము. అటులయినది నిజము. నిన్నటినుండియు నొక్కరీతిగ నన్నడగికొను చున్నది. ధైర్యధ

లగు దొంగలుకానీ యంగనలుకానీ మముఁబోలు లక్ష్మీపుత్రుల యింటి ద్రవ్యభారమును దింపఁజాలుదురు.

వినోద:— నిజము. భామిని అక్కాసాబునుంగూడి యీ దిక్కున వచ్చుచున్నది. వారి యెదుటనైన నీబరువు దింపియుంపుము. సంచుల బరువుదింప నే నీస్తునా?

(భామిని అక్క వత్తురు.)

లక్ష్మీధర:— నేఁడు చక్కఁగ నగపడఁజేయుదును. ఈ యయిదు సరముల పదకము భామినీదృష్టికిఁ బడఁజేయుదును. కొంచెము మిటులటులఁదిరిగి మఱల నైదుతూర్లు దానిదృష్టిలోఁ బడులా గొనరించెద. అదివఱకు నీ సొమ్ముల బరువు వహింపక తీరదు. చూచెను. చూచెను. (...) రును జూచిరి. వినోదా! ఆదినమునుండి భామినిదిక్కు నేను చూడలేదు. అది నన్ను జూచు సాగినప్పుడు నేను నా పాదములపై దృష్టియుంచి నిలిచియుందును. నీవే దానిదిక్కుఁ జూడుము. అది కన్నులార నన్నుఁజూచినపిదప సన్నఁజేయుము పిదపఁ గొంతకాలమటు లిటులఁజూచి ముందుముందుగఁ బోయి దానినిఁ జూడుము. మఱల సన్నఁజేయుము. నాకు నడ్డముగనిలిచి నీవు దానిదిక్కుఁ జూడుము.

అక్క:— చూచితివియా భామినీ! నేఁ జెప్పియుండలేదా? గొప్ప యొక కాపవానియింటిలో నెటు సజ్జలు జొన్నలు నుండునో, యటులనే లక్ష్మీధరుగారి యింటిలో ముత్యములు వజ్రములు నుండును. అట్టి యీ ద్రవ్యవిగ్రహమును వదలి నీకు నా వైర్యాధరుఁడెటుల మనసువచ్చెనో, తలఁచికొనినటులెల్ల నాకు నాశ్చర్యమగుచున్నది.

లక్ష్మీధర:— వినోదా! దానిశరీరమందు నాకంటె హెచ్చునగ లగపడుచున్నవియా? నాముక్కున ముక్కర లేదు. అక్కారణమున దానికంటెఁ దక్కువగ నగపడుచున్నాను. ఇట్టి యాభరణ రహితమగు నాసిక నేనెటు భామినికిఁ జూపఁగలను? ఆఁడువారి స్వార్థసాధనత్వమెంత? ఆ యాఁడుదాని నాసికఁజూడుము. ఆఁడువారుమాత్ర మంతటి వారు. పురుషులగు మేమేల ముక్కుఁగుట్టింపఁ గూడదు? ఇట్టి పద్ధతినిఁ పాదములరాచి పాలువేసి పురుషులు తమముక్కు రెండుతట్లు ముక్కర నుంచికొనులాగునఁ గుట్టింపవలెనని నాకుఁదోఁచెడు. అటుకానిచో నాఁడువారికంటె నధికులమగు మార్గము లేదు. పురుషులునైతము ముక్కరను ధరించు నాచార మనుభవములోఁ దేవలయును. మేము నాఁడువారింబలె వెంట్రుకలుంపమా? పక్కపాపట తీయమా? ముక్కరమాత్ర మేల వేయఁగూడదు?

వినోద:— ఇపుడు మాటలాడవలదు. భామిని లజ్జతో, మిముఁజూచుచున్నది.

అక్క:— అహహా! ఎంతటి వెలఁగలవి యీసొమ్ములు. ఆముత్తెములయొక్కయు వజ్రములయొక్కయుఁ దేజమెంత! మన పృథ్వీధర మహారాజుగారివద్దను, నింతటిసొమ్ములులేవని తోఁచెడు. నా హారముదిక్కునసే చూచుచుండవలెనని నాకుఁదోఁచెడు. నీకును దోఁపవారేమి? ఎంతటి గొప్పవజ్రమది చూడుము.

వినోద:— ఇఁక మీరిచట నిలువవలదు. భామిని కోపముఁబూని యున్నలాగు నగపడెను.

లక్ష్మీశ్వర:-- అటులనా? ఇచటనుండి వెళ్లవలెను. అచటనచటఁ దిరిగి మరలనగపడుదము పద.

(లక్ష్మీశ్వర వినోదులు పోవుదురు.)

అక్కా:— ఏమే! వారుపోయిరి. వెళ్లుదము. వారాదిక్కునుండి చక్కఁగ నగపడుదురు.

భామిని:— వానినిఁజూచి యేమిచేయవలెను? ఆసొమ్ములు వాని దేహముపైనుండునది చూచినయెడల వానివిషయమున నాకు బొత్తిగ ధిక్కృతి కలుగుచున్నది.

గీ. జడులధనరాశి స్త్రీహాస్య శస్త్రముగద?
అధమ జనసక్త యోగిని యందముగద?
పాపద్రవ్యంబు రౌరవపతన కతము
నీకుసుఖమగు, దుఃఖంబునాకు వినవె.

అదినాదృష్టికిఁ బడనీయకు. నీవేయాసొమ్ములు చూచుచు కుశలముగనుండుము. నేనుపోయి వచ్చెదను.

అక్క:— (స్వగ) ఏమి చేయుదును? దీనికినెంత చెప్పితిని! లక్ష్మీశ్వరునిఁ జూచినక్షణముననే మొగము చిట్లించుచున్నది. ఆ ధైర్యధరుఁ డేమరులుమందు దీనిపైఁజల్లెనో యెవఁడెఱుంగును? బాబా సాహేబుగారివద్ద నేనెట్లుహఠము పట్టుకొని కూర్చుందును? అటులొనరించిన నేమియగును? లక్ష్మీశ్వరునకు భామిని నిప్పించు మాటమీఁద సాగను. ఇరువదియైదు లక్షలపరమానము వచ్చువరుఁడే భామినికిఁ గావలయుననిహఠముపట్టెను. (కుసుమ దాసీలు వత్తురు.)

కుసుమ:— అక్కా-సాహేబుగారు! ధైర్యధరునకు నిరువదియైదులక్షల జహాగీరు ప్రాప్తించినదఁట.

అక్క:— అనఁగా:—

కుసుమ:— నీవు తెలిసికొనఁ జాలవాయేమి? (దాసితో) పోవే! నీవు పోయి మొదటనేఁ జెప్పిన ప్రకారముఁ జేయుము. మాలకరికిఁ జెప్పి మంచిహారముఁ గట్టింపుము.

అక్క:— ఏమేకుసుమా! ఇంతటి గడబిడకుఁ గారణంబేమి?

కుసుమ:— ఏమియనఁగా:- ధైర్యధరునకు నిరువదియైదు లక్షలపరమానముగల జహాగీరును నుత్తమోత్తమ యోధులకునిచ్చు మూఁడు బంగారుపతకములను మహారాజుగారిచ్చినారు. బాబాసాహేబుగారికీవార్త వచ్చినది (దాసితో) ఆభరణాగారమునకుఁబోయి భామిని సొమ్ములన్నియును దెచ్చి మేజమీఁదనుంచుము. జాగ్రతచేయుము. (దాసిపోవుచుండును) ఏమే రా. హారమెటు గూర్పుమని చెప్పెదవు?

దాసి:— దేవునికిఁ దగినట్టి హారముసేయుమని చెప్పెదను. మహిషాసుర మర్దనికి వేయఁదగినది. ధానినే భామిని ధైర్యధరునకుఁ బ్రసాదముగనీయఁదగినది. అందులకుఁగాను హారముకావలెను. మాలకరికి నిటుచెప్పుదునా?

అక్క:— కుసుమా! నాకేమియుఁ దెలియకయున్నది. ధైర్యధరుఁడిచటికి నేఁడువచ్చుచున్నవాఁడా?

కుసుమ:— నిజము. ధైర్యధరుఁడు వచ్చుచున్నాఁడు. బాబాసాహేబు గారికి రాజుగారినుండి యొక యుత్తరమును ధైర్యధరుగారినుండి యొకజాబును నేకకాలమున వచ్చినవి. ధైర్యధరుఁడు

కుసుమ:—భామినీ! నేను ముందొక సంగతి విచారింపవలెను. నీవు నీసొమ్ము లేలనీ? అడవివనములో నుండునపుడుండిన వనమాలయొక్క యలంకారము నీకు హెచ్చుగ శోభించుచుండెను. అటు నీవేయనుచుంటివికదా? ధైర్యధరుగారు నగలను ధిక్కరింపరా? అటులైన నగలేల? హెచ్చుగఁ గావలెనన్నని నొకలతియొక్క పల్లవ పత్రము నీ చెవులపైనుంపుము. ఏదయిన నొకపుష్పము తలలోనుంపుము. ఇటులుండ సొమ్ములేల?

భామిని:—ఎందుకనగా? వారు నన్నించుక మోసగించినపిదప నేనుమాత్రము సాధుస్త్రీబలెనుందునా? వారొనరించిన మోసమునకుబదులు నేనీసొమ్ములమూలకముగ దీర్చుకొనియెద. నన్నేలవారు మోసగింపవలెను.

కుసుమ:—ఏమే! ధైర్యధరుఁడిచటికి రానేరాఁడుగదా? వాఁడు నిన్నెటు మోసగించుటకుఁ గారణము దొరికెను?

భామిని:—రాలేదనిన నేమాయెను? నేను రాత్రింబవళ్లు వారిని ధ్యానింతును. స్వప్నము వారివిషయమే. వారిని మూఁడవస్థలయందునుఁ జూచుచుందును. చూచినప్పుడంతయును వారు నవీనులుగ నగపడుచుందురు. నా మనమున వారచ్చొత్తినరీతిగ నుండు కారణంబున వారు క్రొత్త క్రొత్త వేషములుధరించి నాకగపడుచున్నారు. వారిమనసును చొత్తిగ నాకర్షించుటకై నేనొకదినమునకైనను దగినంతమట్టునకు నీసొమ్ములు ధరించి నటింప నాకు నక్కఱలేదా?

చ. నవనవ చిత్రవేషముల నాథుఁడు నన్ను భ్రమింపఁజేయఁగా
యువతిని నేనలంకృతుల యోగముసెందుచుఁ జిత్రవేషసం
భవ ముదమందఁజేయుదును భావభవాంగజుఁబోలెఁ, జూడుమీ
నవరణచక్కఁగాఁగనునొ, సారసలోచన, లోపమొప్పునా.

ఏమే! యుద్ధసమయమునఁగాని క్రీడించునపుడుగాని, జయమార్జించునప్పుడుగాని, యుపాయము లనేకములు నేయుదురుగదా? దానిలో నేమియును జెపుగులేదు. అదిగాక స్వప్నమందిరంబున నేమయ్యెనో తెలిసియునా? వారారీతి దర్శనసుఖమిచ్చుచుండ, నాకేసొమ్ములు వలదని పలికితిని. నేనొకటియు ధరింపనంటిని. అనఁగా వారు మొగమునిండఁ గన్నులు చేసికొని కోపమున ‘‘ నీవు సొమ్ములు ధరించియ తీరవలెనని ’’ పలికిరి. కుసుమా! నేనేమి చేయుదును.

కుసుమ:—అటులనా? అటులనా? అటులైన సొమ్ములేవి యెటుల యొచ్చట ధరింపవలెనని నన్నడిగెదవు? ఎవఁడు నీకు సొమ్ములుధరింపుమని పలికెనో, వానినే యే సొమ్ము లెన్ని ధరింతునని విచారింపవలసినదిగ నుండెను.

భామిని:—నేనువారినే విచారించుచుంటిని. అంతలోనే వారితో మాటలాడరాదని నాకుఁదోఁచెను.

కుసుమ:—అది యెందుకు?

భామిని:—ఇదివినుము: నే నెప్పుడును మొదలు పచ్చచీరఁగట్టుచుంటిని. ఆ చీర బాగుగ నగపడుచున్నదియాయన్ని నేనడిగితిని. అపుడు వారునవ్వి నీల్లచీరఁ గట్టుమనిరి. నేదానిని వదలి నల్లచీర

కట్టితిని. మఱల విచారింపఁగాఁ గట్టుకాలమున బాగుగనుండెనుగాని కట్టినపిదప బాగా లేదనిరి. అమ్మా నాకా కుచేష్టలు నరిపడలేదు. నేనప్పుడే స్పష్టముగఁ బలికితిని.

కం. వినయ విహీనులతో నే
వినయంబున మాటలాడ, వినుమా యింకన్
జనునని నాలోఁ బలుకకు
జనుమానీదారిఁబట్టి చయ్యన, నాథా.

అప్పటినుండియు నేను వారిలో మాటలాడను. దీనినుండి చెడుగనిపించెను. అటుపిమ్మట నేనెంత ప్రయత్నించినను వారియాకృతి కంటియెదుట నిలువకయుండినందున నాకల్పః దర్శనసుఖమును నైతము నేఁ బోఁగొట్టుకొంటిని. కావున నీ రత్నమాలపైననుండునా లోః వేయుదునా?

కుసుమ:—ముసుఁగులోనే యుండనిమ్మని యొకతూరి తోఁచుచున్నది. మఱియొకతూరి ముసుఁగుమీఁద నుండిన బాగని తోఁచుచున్నది. శరీరముపైఁ బచ్చనిరవిక తొడిగికొని దానిప్రక్కన నీ పచ్చలమాల యెటులనో యగపడును. నల్లచీరపైన నిది శోభించును. ఈ మాలపైన నెటుల పుష్పహారము వేయవలెను?

భామిని:—వేయుటకు దెచ్చుట? వారికంఠములోనే.

కుసుమ:—నిజము నే మఱచితిని. నా నీకోరికె కొనసాగెనుగదా? ఇపుడె నీ హృదగ్గలోదంతము ధైర్య ధరునకుఁ దెలిపిన నేమియుఁ దక్కువగపడదు.

భామిని:—ఇంతగొప్పది, యింతటిమంచిది, జరతారుతో నిండినది నాకేల నే తెచ్చితిరి? ఏమే ఇచట నుండు హారముయొక్క పనితనము నీకుఁ దెలియదు. కుసందేశము పంపుటకు నిట్టిమాల తెచ్చి తివి. ఈ మాల యొక్క పనితనము నీవెఱుంగవు. ప్రియకరునకు సందేశమంప నిట్టిమాలను బంపినయెడల నన్నది సభ్యస్త్రీగ నేలఁగూల్చును.

కం. దూతిగఁ బంపిన హారము
నీతియువిడి సవతిగాను నిలువకుమా, నా
ప్రీతికరు హృదయసీమను,
ఖ్యాతిగ నేనుండవలయుఁ గలకాలంబున్,

నాకు వలదీమాల.

కుసుమ:—భామినీ! ఇది యేమే? ధైర్యధరుని కంఠమున వేయుటకు నీకుఁగాను చేయఁబడినది.

భామిని:—నే నీ హారము వారికంఠమున వేయనే వేయను. మహిషాసుర మర్దనినిఁ బ్రతిదినమును బూజించుటకు నెట్టిహారముఁ దేఁబడునో, యట్టి సాధారణమైనట్టియుఁ గొన్ని పుష్పములుగలి గినట్టివియు విశేషపత్రములు గలిగినట్టియు మాల నేను వారికంఠమున వేయుదును. దేవతకు వేయునట్టి మాలయు, ప్రియకరుని కంఠమున వేయఁదగినది. హారములోనే దైవము

మునిఁగిపోయినయెడల భక్తులపై దృష్టినిలుపుట యెటుల?

( వినోదుని ప్రవేశము. )

వినోద:— అమ్మా! బాబాసాబుగారును ధైర్యధరుగారును, మఱికొందఱును నీ దిక్కునకే వచ్చు న్నారు. ప్రథమమున నీ మేడపైఁ గూర్చుండి పిదప మహిషాసుర మర్దనీ దర్శనమునకుఁ బోవుదమని బాబాసాబుగారు పలికినారు.

కుసుమ:— నిజముచెలీ! నాతోసైత మదేరీతిగఁ బలికియుండిరి. అదినీకుఁ దెలుపవలెనని యువసరపడి వచ్చితిని.

భామిని:— అది నాకుఁ జెప్పితివియా? మఱచుకాల మిదియేనా?

కుసుమ:— ఏమే! నీవుకల్పించిన ప్రేమ కలహప్రవాహములో నేఁ గొట్టికొనిపోవుచు దీనిని మఱచితిని. వినోదా? పెట్టెనెత్తుము. అద్దమెత్తుము. ఇవియన్నియును సవతులమేడకుఁ దీసికొనిరమ్ము.

భామిని:— ఒరే! జాగ్రతపడుము. ఆ మేడకు వెళ్లము. కుసుమా! ఇప్పుడు సొమ్ములెన్ని వేసికొను విష యమటులనే నిలిచెను. ఇఁకనాపై వడిగ నన్ని సొమ్ములును వేయుము. అటులనా, యిటు లనాయని విచారింపవలదు.

(భామిని కుసుమ వెళ్లుదురు. )

వినోదా:— వీరటులనే చేతులల్లాడించుకొనుచు వెళ్లిరి. ఒకతూరి లేకున్న మఱియొకతూరియైనను, బని చేయరుగదా! శ్రీమంతుల బిడ్డలీదిక్కుకడ్డి నాదిక్కుఁ బెట్టఁగూడదని శపథము. ధైర్య ధరుడు వచ్చుచున్నాఁడని చెప్పవచ్చినవానినే వెట్టిపనులకుఁ బట్టుచున్నారు. వారువచ్చిరి. ఇవిమోయ లేను.

( సొమ్ములన్నియును దీసికొని పోవును, ధైర్యధర, శీలధర, విలాసధర, లక్ష్మీశ్వరుడు బాబా సాబు వచ్చుచున్నారు. )

ధైర్యధ:— మా పృథ్వీధర మహారాజుగారియంతటి యుదారపురుషు లెప్పుడేని నొక్కరుండుడు. వారు నాకు నిరువదియైదులక్షల జహగీరును మూఁడు బంగారుపదకములిచ్చినది వారి యుదార స్వాభావికఫలము. రణాంగణములో నేనెట్టి శౌర్యముఁ జూపితినోగాని వారు నాకింతటి బహుమతి యిచ్చినారు.

బాబా:— నే నాలోచించినచో మీరు సమరమునందొనర్చిన సాహసమునకు వారిడిన యిరువదైదు లక్షల జహగీరు తక్కువయని తోఁచుచున్నది.

శీలధర:— యోధశ్రేష్ఠులకిచ్చు మూఁడు బంగారుపదకములే యోగ్యములైనవి. మూడు బంగరుపదక ములకెంత జహగీరవశ్యకమో, యంత జహగీరు సేనాపతిగారికి వచ్చినఁ జాలును.

బాబా:— మహారాజుగా రేఁబదిలక్షల జహగీరియ్య సిద్ధులయి యుండిరనియు, మీరు దానిని వలదంటి రనియు వింటిని. ఇది నిజమేనా?

ధైర్యధ:— అదినిజము. నేనె వలదంటిని. ఏఁబదిలక్షలు తీసికొని యేమిచేయవలెను.

లక్ష్మీశ:— ( స్వగత ) భాగ్యమువచ్చునపుడు దానినెటు వెచ్చింపవలెననునది పుట్టు శ్రీమంతులకుఁ దెలి యువచ్చును.

ధైర్యధ:— ఈ ప్రసంగమందు మహారాజుగారు రొక్కతూరిగఁ గోటియుత్పన్నమగు జహగీరు శూరులకు నిడ యత్నించియుండిరి. అదినిజము. అందున నేఁబదిలక్షలు సేనందవలె మిగత నేఁబదిలక్షలు సేనకుఁ బంచియియ్యవలెనని వారనిరి. అటులు త్తర్వయినది. నేను చేతిక్రిందనుండుజనులపనులను గనిపెట్టి యత్నింపఁగా, వారు నాకంటె నధికమగు శౌ ముసు జూపినవారుగఁ దోఁచిరి. అక్కారణమున సకలద్రవ్యము వారికే యిప్పించితిని. సే పతి, తనసేనకీరీతి నుత్సాహము కలిగింపవలసినది కర్తవ్యము.

ఉ. శూరుఁడ నేను శూరులకుఁ జొప్పడ వందన మాచరించెదన్
ఘోరముగాను బోరుచును గ్రుంకుదురా రుధిరాబ్ధిలో, శిరో
వారిజముల్ బడన్, దలఁపవారిసహాయమె మాయశంబగున్
ధారణిసౌఖ్యకారణము ధైర్యసమేతుల సాహసంబగున్

విలాస:— సేనయొక్క సాహసముపైననే సేనాపతి గొప్పతనము నిలుచును కావున సేనకారీతి ను హము గలిగించుట యోగ్యమేను.

శీలధర:— ఏమండీ! నిజము విచారించినచో సేనాపతి సాహసముపైననే, సేనయొక్క శౌర్యమా పడియుండును. శరీరమున లోచనము లెటులనో యటులనే సేనాపతి సైన్యమునకు. సేన కార్యధురంధరుఁడు కాఁడేని సేనకు నంధత్వము కలుగును. అక్కారణమున నొక్కొక్క గుంతలోఁబడును.

బాబా:— ఈ వాదమేల? ధైర్యధరగారూ! తమకు మూఁడుపదకములు దొరకినందులకు నా మా నందమునకు మితిలేదు. మూఁడుపదకము లందినవారు మనరాజ్యములో ముగ్గురు నలు నిలిచినారు. వారియొక్క యింటిశేతనమున నైనను పరాక్రమవంతుఁడెవఁడును లేన యయినది. అక్కారణంబున మూఁడు బంగరుపదకములచే వెలయు నూతనమైన యిం వొకటి మీనుండి ప్రారంభమైనది చూచి యెవరానందింపరు?

ధైర్యధ:— బాబాసాహెబుగారూ! నాపై మీకుఁగల ప్రేమాతిశయమున మీకటు లగపడుచున ప్రేమ స్నేహమున మీరిటుపలుకుచున్నారు. జగత్తులోనిదియ గొప్పసుఖము. బాబా గారూ! అయిదేండ్లకుఁ బూర్వము యుద్ధమెపుడు ప్రారంభించెనో, యప్పుడే శిబిరతల తమకెంత వయస్సో జ్ఞప్తిలోనున్నదియా? అక్కాలమున మీచేతిక్రింద నేను ప్ర మున సేనలోఁ జేరితిని. తాము యుద్ధములోనిలిచిన మూఁడేండ్లు నాపై నత్యంత ప్ర జూపుచు వచ్చితిరి. పిదప దేహారోగ్యములేనందున నిపుడు రెండేండ్లుగ నింటఁ గూ యుండినను నా పరాక్రమము నేనుగ్గడించుచుండినందునఁ దమమాటయనాకు సాఫ పడెను. కావుననే ధన్యుఁడనైతినని తమ్ము సత్కరింపవచ్చితిని. ఏమండీ! పోయిన మూఁడేండ్లుగ నింతటి యకృత్రిమ ప్రేమ నాపైఁ జూపుచువచ్చిన కారణంబేమి? పూర మండలి బాంధవ్యముఁదప్ప నితరకారణంబు నాకుఁదోఁపదు. బాబాసాహెబుగారూ! చూపినప్రేమకు బదులు నేనేమిసేయుఁదును? అదివాకుఁ దెలుపుఁడె. ఈ ప్రశ్నకు నుఁ

తమనుండియు వినవలెనని పృథ్వీవర మహారాజుగారి దర్శనమునకుఁ బూర్వము నేనువచ్చి, రెండుదినములిచట నిలువఁదలంచితిని. తమమానసమునకు సర్వస్వాతంత్ర్యమిచ్చి తెలుపుఁడి. తమకేహితమొనర్తును? మహారాజుగారినుండి తమకెంత జహగీరిప్పింతును? ఏబిరుదు నిప్పింతును? తెలుపుఁడి.

శీ:— ధైర్యధరుగారూ! ఇపుడుండుదానికంటె నధికమగు జహగీరు నేనొల్లను. మఱి నాకు బిరుదులపైనను నిచ్ఛలేదు. ఇఁక నే హితమొనర్తునను విషయములో నా మనని రె టియున్నది. నా బిడ్డభామిని.

ః:— హా హా. బాబాసాబుగారూ! ఏమిమాటలాడునది? భామిని పూర్వము సేనాపతిగారికిఁ జేసిన యపకారము మఱచితిరి కాఁబోలు. వీరియెదుట దానిపేరుచ్చరించినచో వారికిఁ గోపమువచ్చును.

ధ:-- భామిని పూర్వమున వలదనిపలుకదా? మఱల నావార్త యెత్తినచో సేనాపతిగారాదినము వలెనే కినుకచే వెళ్ళిపోదురు.

:— మీ మాటలించుక చాలింపుఁడి. ధైర్యధరుగారూ! నా విజ్ఞప్తి యింతయు. ఆ దినమున నాబిడ్డ తమకు నవమానమొనర్చిన దానిని మఱచిపొండు. ఆదినమునుండియుఁ దనమాంద్యముమాని భామిని బుద్ధితెచ్చుకొనియున్నది. పూర్వవార్తలన్నియును మఱచి భామినిని బరిణయమాడి పవిత్రునఁ జేయుఁడి. ఇంతయ తమనుండి నేనడుగునది.

న:-- బాబాసాబుగారూ!

గీ. ధనికుసుతనాకుయోగ్యయా, దారయగునె
సమరవిజయాంగనకునది, సవతియగుచుఁ,
సుఖమునెటులిడు నిఱుపేదసుతనుఁబోలె
వలదు, ధనికునిసుతను వివాహమాడ,

నా యిరువదైదువేల జహగీరడుగుఁడి యిచ్చెద. మూఁడుపదకముల యోధత్వమడుగుఁడి. పృథ్వీధర మహారాజు నాశిరముపై దానినిడిన క్షణముననే వానినివేఁడి దానిని మీ శిరమలంకరింపఁజేసెద. అంతయకాని తమపుత్రికా పాణిగ్రహణము మాత్రము నాకువలదు. ఆ దినమున "ధనికుని నేఁ బతిగఁగొనియెద నధనుని వలదని" యాడినమాట నేవింటిని. అపుడే నేను బరిణయమాడినచో నొకపేదవానిబిడ్డను జేసికొనియెదనని నిశ్చయించుకొంటిని.

చ. మనముసహింపనోపునెటు మానినిధిక్కృతి......వహ్నియైహృదిన్
గనలుచునిల్చి నామనముఁ గాల్చుచునున్నది నాతిమాట నే
విన, విషమైననున్ దవిలి వీడక ప్రాణముఁ బీల్చసాఁగె ని
ర్ధనునిసుతన్ గ్రహించుచు ముదంబుగ నెయ్యముమీఱనుండెదన్.

బాబాసాబుగారూ! వలదు నాపైఁగినియకుఁడి. శీలధరుగారూ! నాయదృష్టము నిండు చకుత్కా గనున్నది. 'నేనీ యింటికివచ్చినది రెండవతూరియిది. ఇవుడునైతము వీరు

దుఃఖించునటులయ్యెను. ఇది నా గ్రహచారము. వీరి ప్రేమనందుచు రెండుదినంబులైన సుఖముగ నుండవలెనని యిచటికివచ్చితిని. ఇదియును మొదటిదర్శనము ప్రకారమేయయ్యెను. వలను, బాబాసాబుగారూ! అటు దీనులై నాదిక్కుఁ జూడకుఁడి. నేఁజేయునది మేలైన పని. ఇదిముందుఁ గొన్ని దినములకు మీరును దెలియుదురు. శీలధరగారూ! ఇఁకనిచటనుండుట నాకు మేలుగాదు. గ్రామము వెలినుండు మామిడితోఁపులో మనగొల్లెన వేయింపుఁడి. ప్రాతఃకాలముననే మనమిచ్చటనుండి వెడలుదము. బాబాసాహేబుగారూ! తమయింటిలోని మహిషాసురమర్దనీ దర్శనము తీసికొని నేను వెళ్ళిపోను సెలవిండు. పోవుదము. శీలధరగారూ! దేవీదర్శనమునకుఁ బోవుదము.

( వారు వెళ్లుదురు. )

బాబా:—ఇట్టిదుఃఖవిచారము నాకెన్నఁడును ఘటించియుండలేదు. (వెళ్లును)

విలాస:— మందులేకరయే దగ్గుచూనె. నులక్ష్మీశ్రీధరుగారూ! ఇఁక భామిని మీదేను.

లక్ష్మీశ్రీధ:—నను౯దప్ప దానికి మఱియెవరుఁడు దొరకును? (వెళ్లుదురు).

(భామిని కుసుమ ప్రవేశింతురు. )

భామిని:—కుసుమా! నాకు నేఁడెంత్తయాశయుండెను. సుఖపర్వత శిఖరమందితినని తెలిసియుంటిని. అయిన, నిపుడొక్కదెబ్బన నా శిఖరముపైనుండి క్రిందికిఁ ద్రోయఁబడినటులాయెను. కాదు కాదు. ఇఁకను నాయాశ నిలిచినది. పేదవానిబిడ్డను పెండ్లిచేసికొనియెదనని వారి నిశ్చయముకదా? నేనే యేల బీదబిడ్డనేల కాఁగూడదు? కుసుమా! పద, మనము మఱల పేదలఁబలె వేషములు ధరింతము. నీవు మఱలఁ బుష్పమాలవుగమ్ము. నే వనమాలనయ్యెద. రణాంగణ సమీపముననుండు నీ తోఁటలో మనముందుదము. ఆ సొమ్ములను బృథ్వీధరమహారాజుగారి వద్దకుఁ దీసికొనిపోవు నెపమున సేనాపతిగారిసరసకు మనముపోవుదము. విజయమందిసేనయెపుడు రాజధానికివెళ్లునో యప్పుడు సేనతోఁ గూడియుండి బీదబిడ్డలవేషమున ధైర్యధరుని ప్రేమనార్జింతను. కుసుమా! ఈ సొమ్ములు నానుండి తీయుము. ఇంతటినుండి బీదబిడ్డనయ్యెద. ఈ చచ్చినసొమ్ములే నేఁడునాకు నపశకునములయ్యెను. సొమ్ముల విభవమింతటినుండి నే నెప్పుడేగాని నేఁజూడను. ఆ శవములను నానుండి దూరముచేయుము. నన్నిప్పుడే బీదవానిబిడ్డగఁ జేయుము. ( సొమ్ముఁజూచి )

కం. నగలన్ని ద్రుంచివేయుమ
వెగటగు సీధనికవృత్తి విడువుమయింక౯
బగఁగాఁ జూడుమధనమును
దగునని కడుబీదయగుచు ధవునిఁబడయుమా.

( నిష్క్రమము. )



# మానాపమాన నాటకము.

చతుర్థాంకము - ప్రథమరంగము.

ధైర్యధరుని - శిబిరము.

శీలధర - సేవకులిరువురు.

**శీలధర:**—ఓరీ! మీరుకూడ సెలవు వేడసాగితిరియా? అటులైన, సేనాపతిగారి స్వంతము పనికినుండు వారెవరు? యజమాని తనపనిని దానే చేయవలెను, సేవకుఁడు సుఖమనుభవించుచు నింటనుండవలెను. ఇది బాగుగనగపడుచున్నదియా రేమి?

**1-సేవక:**—అందఱికిని సెలవు దొరకెను. మేముమాత్రమిచట నడఁగిపడియుండవలెను. ఇది యన్యాయము కాదా?

**2-సేవక:**—మన సేనాధిపతులకు మూఁడుబంగరుపదకములపదవి లభించిన కారణంబున వారుమఱలి వచ్చిరి. అందులకుఁగాను సేనకంతయు నత్యంతానందమాయెను. వారుధరించు మూఁడు పదకముల వగడికి వందనములర్పింపవచ్చి పిదపనొక నెల సెలవందిరి. పోవలెనని యిచ్ఛయుండినవారెల్లరుఁ బోనగునని సేనాపతిగారు సెలవిడినారు. కావునమాకును సెలవియ్యవలెను.

**1-సేవక:**—ఈ యైదేండ్లగ యుద్ధమునఁబడినాము. పరమేశ్వరుని కృపతో బ్రదికినాము.

**2-సేవక:**—ఇపుడొక నెల యింటిలోఁగూర్చుండి బిడ్డపాపలముఖదర్శనసుఖం బనుభవింపనిండు.

**శీలధర:**—నామనమునందుకూడ నెలదినములంటిలోఁ గాలముఁగడపవలెననియిచ్ఛయున్నది. ఒడంబడిక నైతము ముగిసెను. శత్రువులనుండి సెలవందితిమి. రణమైదానమువదలి వచ్చితిమి. సేనయంతయు నొక్కదారిగ రాజధానికి వెళ్లెను. ... ... ... ... ... ... కావున సేనాధిపతులవద్దనుండు వారందఱును సెలవువేడినచో నేనింటికిఁబోయి స్వస్థముగఁ గూర్చునుటకు సెలవెటు దొరకును? నేనుస్వార్థసాధనపరుఁడని యనినను జింతలేదు. నాకు సెలవు దొరకకమునుపు మీకెవరికిని సెలవియ్యఁడని నేఁ జెప్పను.

**1-సేవక:**—మీరుచెప్పకున్న మంచిదేను. అంతరాయము పలుకకుఁడి. మహారాజుగారి సరసనిపుడుండు వనమాలమూకు సాహాయ్యపడును.

**2-సేవక:**—మేముపోయినను మాపనితాను నేయుదునని పలికినది, దానినిఁ జూడుము వనమాల యీ దిక్కుననే వచ్చుచున్నది.

(భామిని - కుసుమ వినోద. ప్రవేశింతురు)

**1-సేవక:**—మేము వేఁడికొనినరీతిగ మాకు సెలవు దొరకునుగదా?

**భామిని:**—మంచిదర్శనము నేనుమీకి దేవిషయముఁ దెలుపనుంటిని ఏయభ్యంతరమును లేదు మీరు సెల

వుమీద వెళ్లుఁడి మీనిత్యకృత్యమేమయినదియు నాకు మొదటనే తెలుపుఁడి.

1-సేవ:-- నేఁజేయుఁదగిన గొప్పపనియేమియును లేదు. సేనాపతిగారియుడుపులు సవరించియుంచుట యంతయు.

భామిని:— ఈ పనిని నేఁ జేయుదును. [మఱియొకనితో] నీవు చేయఁదగినపనియేమి?

2- సేవక:— వానిపనికి నేఁదోడ్పడుట.

భామిని:— నాకుఁదోడ్పటకుఁ బుష్పమాలయున్నది.

2-సేవక:— అదిగాక, వంటపని పైననే నధికారిగనుందును.

వినోద:— వంటవార్పులపని నేనొక్కఁడనే చూచికొనియెదను. వెళ్లుము. సేనాధిపతితో సైతము మీరు సెలవుపై వెళ్లినను నేనొక్కఁడే మీపనిఁజేసెదను.

1-2సేవ:— మామనవిపై నేమియాజ్ఞయయ్యెను?

భామిని:— వెళ్లుఁడి! మీరు నేఁటినుండి సెలవుపై వెళ్లుఁడి.

సేవకులు.— పరమేశ్వరుఁడు నీకుఁగళ్యాణముఁ జేయుఁగాత [వెళ్లుదురు]

శీలధర:— నాకు సైతమొక నెల సెలవుపైనఁ బోవలెనని చెప్పఁదలంచితిని. కార్యావస్థ యెటులగునో యనుచింతదపలినది.

భామిని:— నీ వొనరింపఁదగిన పనియెద్ది?

శీలధర:— నేఁ జేయఁదగినపని యిద్దియని నిర్ధారము లేదు. ఎల్లకాలమందును సేనాపతి సరసనుండవలెను పడినపనిఁ జేయవలెను.

భామిని:— ఇదినిండ కఠినమైనపని. నేను బీదదానను. శారీరకష్టములన్నియును జేయఁగలము మేమిరువురము. గొప్పవారి కనుగుణ్యముగుపను లొనర్చుచు వారికి సంతోషముఁగూర్చుట యెటుల? మేమెటులిప్పని సాధింపఁగలము?

శీలధర:— ఏమమ్మా! నేనిప్పుడుమూఁడేండ్లుగ వారిసరసఁ గొలువునను న్నాను. అయిననొకదినమైనను, వారిహృదయమెఱింగి పనియొనర్చి వారిని సుప్రసన్నులఁజేయజాలనైతిని.

మూఁడేండ్లుగ నావల్లఁ గానిపనిని మూడుదినములలో నీవుసాధించితివి. శౌర్యధరుగారి మనమును నెటుప్రసన్నత నందఁజేయవలెనో, దానిని నీనుండి మేము నేర్చికొనఁదగినదిగనున్నది.

వినోద:— ఈ విద్య నేర్చికొనిన వచ్చునది కాదు. గుణాధారమైనది.

శీలధర:— నాకేమియు వలదు. శీలధరుఁడును వెళ్లినను జింతలేదని సూచించు శబ్దము నీనుండి వారి చెవులఁ బడినఁజాలును. నాకు సెలవు దొరకును. బిడ్డపాపలతో రెండుదినములు కాలము గడపివచ్చెదను.

భామిని:— నీవు వెళ్లవలెనని యుండిన నాయభ్యంతరమేమియును లేదు. నాకించుక హెచ్చుపనియగును పిల్లపాపలను గూడి నీవుసుఖమున నుండ నిచ్ఛయించినపుడు వారిసుఖమునకు భంగము నేనేల గల్పింపవలెను?

శీలధర:— అటులైన నావనికి నేర్పాటిటు లొనరించితినని సేనాపతిగారిచెవులలో వేసి నేనీదినమునుండి సెలవుపయోగించికొనియెద. మీయుపకారము నాపై హెచ్చుగనిలిచెను. (వెళ్లును),

కుసుమా:— భామినీ!

భామినీ:— ప్రస్పమాలా! ఇదియేమే? ఎంతగట్టిగ భామినీయనియఱచెదవు నాపేరువనమాల. మఱవ వలదు కుసుమా.

కుసుమ:— ఏమే నేను నీపుట్టింటి చెలికత్తెను, నీయత్తగారింటి పేరునానాలుకకుఁ ద్వరలో నేటు లల వాటగును.

వినోద:— పుట్టినింట నుండునపుడు పుట్టింటి పేరునఁబిలువవలెను. అత్తగారింటనుండునపుడత్తగారింటి పేరునఁ బిలువవలెను.

భామిని:— అత్తగారిల్లు. పుట్టినిల్లని యప్పుడే యేలపేరిడుచుఁ గూర్చుంటిరి? కుసుమా. వినోదుని వలెనే నీవును బలుమాఱులుచేష్టలకు నారంభించితివియనితోఁచెను.

కుసు:— పలుమాఱెప్పుడే వనమాలా? ఏమే ధైర్యధరుగారిని విచారింపకనే వారియధికారమించుక వహించి వీరికి నెలవిచ్చితివి. అధికారిణివి నీవేయయినరీతినాకుఁదోఁపదా?

వినోద:— నాకునైతమటులనే తోఁచెను. ఆసేవకుల తొందరఁదొలఁగఁజేసికొనుటకై భామినియటు లొనరించెను గాఁబోలు. కుసుమా నీవును నేనును రెండుమూఁడుదినములలో దీనికిఁగన్నొత్తుదుగ నుంసుము. మమ్మునది తొలిపేయును. తొలిపేయించి కొనుటకంటెను మనమే నెలవుతీసికొనుటమేలు కాదా? భామినీ! నేనొకటి మనవి చేసికొనియెదను నాకును నెలయో రెండునెలలో సెల విప్పింపుము. నాచేయఁదగినపనియేమియును లేదు. ధైర్యధరుని నప్పుడప్పుడు నవ్వించుపని యంతయ. నీవుసరసముండు వారెప్పుడును హాస్యముఖులుగనే యుందురు. కావున వేఱుగవిదూషకుఁడేల?

భామిని:— ఇంతటితో ఛలోక్తులు ముగిసెనా? వారియుఘరు నేఁటినుండి నెలవుపైఁబోవుచున్నారు, వినోదా! వారిపనులు చక్కఁగ నేర్చికొనుము. వెన్నము. కుచేష్టలుదప్పమిగత వన్నియును నేర్చికొనుము. పొమ్ము.

[వెళ్లును]

కుసుమ:— వనమాలా! ఆసేవకులకు నీవే నెలవిచ్చితివని ధైర్యధరుఁడు నీపైఁగోపగించినచో,

భామిని:— ఎన్నటికినిఁగినియరు.

కుసుమ:— నాకేమో భయమగుచున్నది. వారాగ్రహించినచో సకలకార్యములు చెడిపోవును. బీదదాన వయ్యును పరాయిదేశమున వానివద్దనుండియును. సేవకవృత్తిఁజేయుచు, వాని యనుగ్రహమందడము మన పనిగనున్నది. ఇవియన్నియును నవిచారమూలకమునఁ బోవునుగదా!

భామిని:— ఇంతటి భయము నీకువలదు. నాయాకారముద్ర వానిహృదయస్థానమున మెల్లమెల్లఁగ స్థాపింపఁబడుచున్నది. ఎంతవఱకు నాపైఁబ్రేమ స్థాపింపఁబడినదోయని పరిశీలించుటకునై నేనారీతిగ సేవకులకు నెలవిచ్చితిని. ప్రియకరుని ధనాధికారములనుపయోగింప నిప్పటినుండియ కొంచెము కొంచెము ప్రయత్నించెద. అనఁగా మాయిరువురి హృదయాంతరప్రేమ తరంగముల తంతుల జతయొక్క స్వరమూలకమున మేళవయ్యెనో లేదో యని చూడవలెనుగదా?

కుసుమ:—నీయంతట నీవే దీనినిఁ జూడవలెను. నీపీయుక్తులు చక్కఁగ నెఱిఁగిన దానవుగావు. సేవాధర్మము గహనమని పెద్దలనరా? అనేకవేళలలో నీవు పనికిరానిమాటలనేకము లాడుచుందువు. ఎప్పుడు మాటలాడవలెనో యపుడు మూకిగానవయ్యెదవు.

భామిని:—కుసుమా! నీవు చింతసేయవలదు.

ఉ. నాలుకమూకియైన, నయనంబుల మాటలనాడనేర్తు; ప్రే
మాలయమందు నాథుని సాదరబుద్ధిని నిల్పనేర్తు; నే
మేలుగనన్ని కార్యములు మిక్కిలి యక్కఱ సేయనేర్తు; నా
మేలిమి నేనెఱుంగనేటు? మేలగు మాకు సరోజలోచనా.

కుసుమ:—ఉండినటులనే సేవకులకంటెతెకిని పిలవిచ్చిన కారణంబున పని హెచ్చగును. నీ వీకోమల దేహమున నీదిక్కు పుల్లనాదిక్కు నుంపఁజాలని దానవు. కష్టకార్యములు చేయఁజాలవు. స్వామి కోపగించినచో నిచటనుంటయు కష్టమగును.

భామిని:— ఓసీ! నే నిచ్చట సకలకార్యములు నిర్వహించి వారి నెటులరైన సుప్రసన్నులఁ జేయఁగలను.

కం. పదముల సేవింతును మృదు
పదముల ధవునంతరంగ పద్మమ్మున ష
ట్పదమయ్యెద ననురాగా
స్పదయయిమని యెదను వలదు భయమింక నీకున్

[నిష్క్రమము].

ద్వితీయరంగము

ధైర్యధరునిశిబిరము - భామిని - ధైర్యధర.

ధైర్యధ:—నేనిన్నిదినములు సేనాపతిగఁ గార్యములొనర్చుచున్నానుగాని నేఁడు నే నొనరించినంతటి తప్పునెన్నండు నొనరించి యుండలేదు. పడినపండు చిక్కినఁజాలుననియెన్ని శిలఫరుఁడెటు వెళ్లిపోయెను! వాఁడు నాసరసలేని కారణంబున, సకలసైన్యమును నను జూచి లోలోన నవ్వుచున్నారు. సేనయంతయును నాకువందనములిడు సమారంభములో నేనువనమాలిని, నాసరసనుండికొంటిని. ఇదియగొప్పతప్పుగఁ బ్రారంభమాయెను. వీరులు నాకునమ్రులైరి. ధైర్యధరా! భళి-భళీయను గౌరవశబ్దమొకటి యెందఱును ఘోషించుతఱి సైనికగౌరవమును గాపాడికొనుమనము నీకుఁ లేకపోయెనా? సైనికులు విషయమే మను కొనుచుందురు? మూఁడువదకముల యధికారియయ్యు నిరువదైదు లక్షల జహగీరుదారుఁడయ్యు సేనాపతిగ నిక్కనని సర్వులు దూషింతురు. నేనేమి సేయుదును? వేటువేలు దారుల నుండి నేనవచ్చి వందనములర్పించు వేళ, వనమాలి తన దొంగచూపుల నన్నుఁ జూచెను. కపోలములు స్మిత చంద్రికలు ప్రసరించునటుల చిఱునగవునగుచు నన్నెద్దియోయొక ప్రశ్న విచారించుచుండెను. వీరుల నెవరినిఁ జూచినను వనమాలివేషమును ధరించివచ్చినవారింబలె

నా కగపడుచుండిరి. వీరపురుషులారా! మీయెడ నేను శతాపరాధిని. సహస్రాపరాధిని. నాకుఁ బిచ్చిపట్టించిన యీ తరుణీవేషము నా మనమును భ్రమింపఁజేసి మిముఁజూచు నవకాశంబెను, మిమ్ము లక్ష్యముసేయక యీ వనమాలీముఖకమలమును నిర్లజ్జతఁ జూచుచుంటిని. మఱల దాని యస్పష్టమైనట్టియు నర్ధోచ్చారణము గలిగినట్టియు ప్రశ్నలకు నోటికి వచ్చినరీతిగ నుత్తరములిచ్చుచు నిలిచితిని. ఇదిమీకును నాకును మన యోధుల నడవడికకును శ్రేయస్కరము కాదుకదా? వనమాల యించుక దూరమరగినపుడు, దీనితో నింతగ మాటలాడునది నాకుఁ దోఁచెనెటులయని నా యంతకు నేనే విచారింపసాగితిఁ; మఱల దాని కపోలరుచి తరంగజాలము లొక్కటొకటి యీఁగుచు నా నాలుకను నటింపఁజేయుచుండెను. దానిలజ్జయును నామాటలు నిండిపోయెను నిజము. ఇది నిజము.

ఉ. ఫాలతలేందుమండలప్రభల్ స్మరసాగర వీచులెచ్చ గాఁ
గాలఁగఁజేసెనామనముఁ గోమలి యీ వనమాలి యందునన్
వాలగుంగన్నుఁదోయి నిడువాలులుగా నొనరించునా హృదిన్
జాలుగఁగ్రుచ్చి ధీరతను జాల్కొనఁజేయఁగఁ జాలెనీరుగన్.

నా మస్తకముపైనుండు నా పగడీరుమాలయును చంద్రుని సాన్నిధ్యమువలన నింతటికష్టము లొందవైను. ( పగడీ చేతిలోనుంచికొని ) చంద్రా! నిన్ను నేనింతగ సన్మానించి శిరముపై నిడికొనిన యుపకారమునకు బదులు నీవు నన్నింతగఁ గారించెదవా? ఒకసమయమున నున్నత పదవికి హెచ్చి శ్రేష్ఠుఁడనైతినని యున్న తుదకు నా శిరముపై మిరియములు నూరకపడలవుగదా? దీనియనుభవము, చంద్రా! నీవు నాకుఁ జక్కఁగఁ దెలియఁజేసితివి. చూడుము. శిరమునుండి క్రిందికి దించినవెంటనే నీవెంత బలహీనుఁడవైతివియో చూడుము. భోర్తిగ దిట్టించి నన్నుఁజూడుము. నీనుండి నాకు మదనబాధ యెట్లు హెచ్చునో చూడనిత్తుమ్ము. నేఁడు నే శుద్ధుఁడనైతిని. దీనిని విచారింపవలెను. శీలధరుఁడును మఱియు నితరసేవకులును నా సెలవందక వెళ్ళిరెటుల? వారికి సెలవిచ్చు నీ వనమాలియెవతె? ఈ చంద్రునిఁ దలఁబడి ఖండించినాను. అదియిపుడు రానిమ్ము. ఎంత బాధించెదవో చూడుము. గొప్పసేనకు సేనాపతినైన వాఁడొక పిల్లవాడు బొమ్మయని తలంచితివియా? అదియేమి యింకను రాకయున్నది? శీలధరుఁడును నితరసేవకులును నెటువెళ్ళిపోయిరి? వారికి సెలవెవరిచ్చిరి? నే నొంటరిగ నిచట నెటులుండుదును? నా యొద్దకు లెవరుదీయువారు? ఎవరును లేరా యిచట? అందఱును చెవుటివారై రారేమి? ఏసేవకు లిచట లేరాయేమి? ( పరదాలో, మహారాజా! నేనిపుడు వచ్చుచున్నాను. నా చేతనున్న విసనకఱ్ఱ నేనిపుడే యెచటనో యుంచినాను. చక్కఁగ వెదకి తెచ్చెదను. ) మంచిది మంచిది. వేగమెరమ్ము...హా! హా! ఏమిచమత్కారమిది. "వేగమెరమ్ము"ను శబ్దమునైతము కోపబలమున నా నోటరాకపోయెను? హా! ( పరదాలో ) ( "నేను వేగమె వచ్చుచున్నాను మహారాజా" ) అంతటి యవసరపడ వలదు. సావకాశముగ......త్వరగ...... ఏమిరా......నా కోపమంతయును నొక్కమారిగ నెటుపోయెను? వనమాలా! నీ యొక్క రెండుశబ్దములే నాకు శాంతత్వముఁ గలిగిం

చెను. వీవనవిసిరి చల్లఁజేయ నేల? పూర్వకాలమందలి రథుల మహారథుల ధనుష్టంకార ధ్వని విననంతనె ముక్కలిడినేర వణఁకుచుండెను. బాణ ధనుష్టంకార సాహాయ్యము నందకయ, వనమాలా! యీ వేళలో నంతటి పరాక్రమము నాపైఁ జూపితివి. నా యావేశము, క్రోధము, నా యోగ్యత్వమును నీ శృంగారముచే నొకదెబ్బఁ బోఁదోలితివి. నవరసములఁ ప్రేమాలయమునందుండి ప్రేమతేజమును బెంచుచు నా ప్రేమయు జ్వాలముట్టియుండునది నిజము. కానిచో ప్రేమయొక్క ధ్వనిమాత్రము వినినతోడనే దీనదాసునిబలె నా క్రోధమంతయు నడఁగిపోయె నేల? ప్రేమసుఖము నాకవ్యాహతముగ నిపుడందనాయెను. ఇపుడు యుద్ధబాధలు లేవుగదా? ప్రేమచే విడువఁబడినఁగదా కరుణరస బాధ హెచ్చును. సర్వవిచారములకును, సర్వవికారములకును, సర్వయుద్యోగములకును, సర్వగుణములకును మూలాధారము ప్రేమయే. హెచ్చనేల ప్రేమలేనితావు జగమందే లేదు. ఇట్టి ప్రేమవలలోఁబడిన సేనాపతి ధైర్యసింహుఁడు సర్వసైన్య సమక్షమున నేమోయించుక శృంగారచేష్ట యొనర్చినందులకు సేనయంతయును నవ్విరేల? సైన్యమూరక నవ్వరనినచో నాకు నంతటి విషాదము కలుగనేల? నిజముగ నాదేమియుఁ దప్పు లేకున్నను నేనూరకే నా యానందమునుఁ బోగొట్టఁజూచితిని. అట్టి యానందము నాకుఁబోయెను. ఆసుఖము దారి బహిరంగముగ ద్రొక్కనిచోఁ బురుషార్థమేమియుఁ గనఁబడదు. ఇపుడు వనమాల వచ్చినతోడన దానికి స్వచ్ఛముగఁ దెలిపెదన. "నీవు నవ్వులకు నెలవిడినందులకు నేను బొత్తిగ సంతసించితిని" యని తెలిపెదను.

గీ. జనులనయనోత్సవంబుగ సర్వరసము
లొక్క శృంగారరసమున నొప్పుచుండు
నింద్రధనువున వర్ణము లేకమైన
శ్వేతవర్ణంబునగుచును జెలువుఁగనవె.

అదిగనుము. వనమాలవచ్చెను. క్రోధమనువస్తు వే గ్రామములోనిదియో నాకునిపుడు స్మరణకు నైతమురాదు. ( భామిని ప్రవేశించును )

భామిని:— నానుండి యించుక తప్పయినది. ఈ వీవన యెచటనుంచితిననునది స్మరణకు రాలేదు. ఇఁక ముందు ప్రతియొకపదార్థమును మంచిస్థలములోఁ బెట్టఁ బ్రయత్నించెద. మముఁబోలు బీదలయిండ్లలో వస్తువులుంచు నవశ్యకత యేమియు నుండదు. ఏవస్తు వెచటనుంచినను మఱపురాదు. ఇంతటి శ్రీమంతత్వమునుఁజూచి నేను భ్రమజెందితిని. తత్కారణంబున సేవకావృత్తికి నంతరాయంబు గలుగుచున్నది. కినుకవహింపవలదు.

ధైర్య:— ( స్వగతము ) నేను కోపగించితినని తెలిసి యిది మంచిమాటలాడుచున్నది. లేనికోపము దెచ్చికొని కొంతకాలము మౌనముననుండెద.

భామిని:— ( గాలివిసరుచు ) నాపైఁ (ముఖముద్రిప్పి కూర్చుండును) కోపము లేకయుండుటకదా? నాచేత నెంతవరకగునో యంతవఱకు సేవచేసెద. పరాయిస్థలమున శ్రీమంతునియింటిలో సేవఁజేయుచు నెటులుండవలెనో దాని నిచట నేర్చికొనినయెడల్ల నా స్వయత్న [illegible]

తోషమగును. అతఁడు ముందు నాకేమగునోయను చింత దూరమగును. మహారాజా! నిజము విశేషకష్టపడి నానుండి సేవపుచ్చుకొనుఁడి. సేవాధర్మము నేర్పినచో నే మీ యుపకారము స్మరించుచుండెద.

ధైర్యధ:—వనమాలా! నీవు సేవావృత్తికి జన్మమెత్తితివని నాకుఁదోఁచదు. నీవిటు గాలివిసరుచుంట నాకెటులనోయున్నది.

భామిని:—ఎచటఁ దప్పొనర్చినను నాతప్పుఁ దిద్దుచుండవలెను.

ధైర్యధ:—గొప్ప తప్పయినది.

భామిని:—అదియొద్ది?

ధైర్యధ:—నీవిటు కూర్చుండవలెను. నేనటునిలచి నీకుఁ గాలి విసరవలెను. ఇచటఁ గూర్చుండుము. నేను జూచి గాలివిసరెద. ఏమిది? దూరముపోయెదవు? కోపముదచ్చెనా యేమి? (స్వగత) నేన వసరపడి యేమోయొకటి యంటిని.

భామిని:—పెద్దపెద్ద శ్రీమంతులు స్వేచ్ఛానువర్తులు. వారి చిత్తవృత్తి ననుసరించుట నిండుకష్టమని నా నాయన్న చెప్పుచుండెను. తాము మూఁడుపదకముల యోధులు. ఇరువదైదులక్షల జహగీరు దార్లు మూఁడుపదకముల యోధులు. మీరా, గాలివిసరువారు? నేను విసరించుకొనుదానవా? శ్రీమంతులు తామేకష్టపడువారును గారు. వారేపని చేసికొనినయెడల నపుఁబోలుబీదది యెట్లు పని నేర్చికొనవలెను?

ధైర్యధ:—నీవు పని నేర్చికొని యేమిచేయవలయును?

భామిని.—ఎవరోయొక శ్రీమంతుగారి రాణివద్ద సేవకు నిలువవలెను. నేను విలాసధరుని యాశ్రితులలో నుండుదానను. ఆ మహారాజును నాకుఁదెలుసును. నా నాయన్నమనసులో విలాసధరుని పెండ్లాము చెల్లెలగు భామిని........బీదలజన్మగాథ శ్రీమంతులచేఁ జిక్కుటయకదా? నేనిది మఱచితిని. నాతప్పు క్షమింపుఁడి. ఇఁకముందు తమకేలాటి శ్రమయిడను.

ధైర్యధ:—అదియెటులగునే? ఆ భామినిపేరు వినఁగనే నా కాగ్రహమువచ్చెను. ఆ విషనామము వనమాలీ మధురాధరముల నుచ్చరించుటవల్ల నాకంతటి దుఃఖము ఘటిల్లలేదు. ఆ నామము నీ ముఖకమలమునందెంత తిరుగుచుండినను నీ యధరామృతమునందెంత పొర్లాడినను, విషము విషమేను. మంచిది. ఇఁక నీముందు వార్తఁదెలుపుము. ఉరకైతివేల? ముందు తెలుపరాదా? వనమాలా! నాసరసనిటు మౌనమువహించుట యనఁగా భామిని విషనామము నాచేఁ బలుమారు లుచ్చరింపఁజేయవలెననికాదా? దానికి సిద్ధుఁడుగ నున్నాను. అటులైన మునిగెనా? ముందువార్త తెలుపుము. ఎన్నిమారులు భామిని భామిని యనవలెను చెప్పుము. చెప్పఁగూడదా? భామినీ, భామినీ భామినీ.

భామిని:—ఆ భామిని సేవకావృత్తిలో నన్నుంచవలెనని నాతండ్రి సంకల్పము శ్రీమంతులయింటిలో నెటులుండవలెననునది నేర్చికొనుటకు నిచటఁ నన్నుఁజేర్చెను. మీనుండి నాకగు నుపకార మిదియేను.

ధైర్యధ:—నీవు నాసేవ నీవయి చేయుచున్నావు. ఇది నాపై నీయుపకారము. ఆభామినిసేవలో

నుండు కారణము నీకేమియును లేదు. నీతండ్రి నీకట్టివని ముడివేయవలెననిన నేనే నీ తండ్రి వద్దకువచ్చి నీ విషయమున:—

భామిని:—నా నాయన్న చెప్పినను చింత లేదు. నేనేమో మీకు ముందు కాఁబోవు భార్యవద్ద సేవకురాలనై యుండెద. భామినివద్దనుంటకు నాకు నెంతమాత్రమిచ్ఛ లేదు. అదియునుగాక యా భామిని నిండుగర్విష్ఠియని నే విన్నాను.

ధైర్యధ:—శ్రీమంతుల గర్వముతో నిండినదది. నీకును దానికిని నొక క్షణము సరిపోదు.

భామిని:—దూరినవారిని బోఁచిన్నపిల్ల యాడుచుండును.

ధైర్యధ:—బొత్తిగ నిజమది. నీవలనది కనవుగఁజూచుము. దానిగాలి సోకుఁడంతదూరమునవైన నిలువనెన్నకు.

భామిని:—పెదవిమీద పడిన నేలెముపంటుకు, నాలుకలోనికి బోయినంత, దానిసేవఁ జేయవలసివచ్చును.

ధైర్యధ:—ఆ సోమరి శ్రీమంతులు బీదలమెమ్ముకులు విలువ జన్మమెత్తినవారు. నీ వెప్పుడేగాని యా భామిని సేవకురాలనుంటివేని యొక రెండుదినములలో నమ్ముఖిరిగిపడుదువు. నీవంటి సుకుమార దేహవు మృత్యుముఖమునఁ బోయు ఘాతకమునకు నీతండ్రి సుతిగాక మానఁడు.

భామిని:—మహారాజా! ఇదినిజము. అటులగును నిజము. అమ్మా వలదు నేనా భామినీసేవలో నుండనే రాఁడను. ఆ గర్వ శ్రీమంతుని యాపిల్ల నాప్రాణము, నాకు వలదనిపించుము. శ్రీమంతుల యింటి నౌకరియనఁగా, ప్రాణకంటకము. శ్రీమంతత్వముతో నిట్టిదోషము దైవము గల్పించియుండునని నాకుఁదోఁచెడు. శ్రీమంతుఁడయి రెండుదినములయినను సేవకులించుక సమీపమున లేరేని వెంటనే వారిప్రకృతిమారును. ఒకవేళ గొప్పయుద్ధమున నపజయమయ్యెనేని సేవకులపైన ఘర్జించుచుందురు. మఱల నెడమప్రక్కకు వాలికరుమాలను గుడిప్రక్కకుఁ ద్రోయును నొకవనమాలి, కావలసివచ్చును. మహారాజా! వనమాలియవతారము రెండుదినములలో ముగియును. ఈ యుపకారము దైవముపైనున్నది.

ధైర్యధ:—ఎవరియుపకారము? ఇఁక నా చెవులుపిండి బుద్ధిచెప్పువారెవరున్నారు? కన్నులుమందువేళ పురుషునకుఁ గూరుకుమందువేసి స్వచ్ఛముచేయుయుక్తి యాఁడువారే సాధించునది. ఏదేవుని యుపకారము నీపై నిలిచినది? చెప్పుము. సిగ్గువలదు, పలుకుము. నాయందేదోషము నీకగపడినటో యాదోషముచు బలుమాఱుగ్గడించి తుదవఱకుఁ బలుకుచుండుము.

భామిని:—తమదోష మించుకైనను నాకుఁదెలిసియుండినచో నేనిట్లు సంతోషముగ మిము సేవింప నేల వచ్చుచుంటిని? మీయందు దోషమేమియును లేదు. శ్రీమంతత్వమించుక యాగవడుచున్నది. మఱియు శ్రీమంతుల భామినుల నైజస్వభావము వదలింపనైనను, లేక సేనాధిపతుల పాదములందుఁ బడియుంటనైనను నుండువాఁడను. అనఁగా దైవముయొక్క యుపకృతి నాయందు హెచ్చుగనున్నది ఎవనికోయొక శ్రీమంతునకు నన్నిచ్చి వివాహముఁజేయు కోరిక నాతండ్రికి లేదు. అటులనే నాకును శ్రీమంతుని వివాహమాడుతలంపు కలనైనను లేదు.

ధైర్యధ:—పృథ్వీధర మహారాజుగారి సేనాపతి, మూఁడుపదకముల యోధుఁడు నిరువదిదుల లక్షల జహాగీరువారుఁడు. మఱియు శ్రీమంతుఁడుగ నేనున్నాను. ఈ ధైర్యధరుఁడు, యోధుఁడును కాడు,

జాహగీరుదారుఁడునుకాదు, శ్రీమంతుఁడునుకాదు. అట్టి సేనాపతిని నీవు తుచ్ఛముగఁ జూడ నేల పలుకుము. ఈధైర్యధరుఁడు నీకంటె దరిద్రుఁడు. దీనికిమఱుఁగు.

భామిని:— తుచ్ఛమును గొప్పను భేదించునట్టిబుద్ధి యూఁడువారికేలవచ్చును? నాకంటికేమో ధైర్యధరుఁడే యోధుఁడని యగపడును. జహాగీరుదారుఁడని యగపడును. శ్రీమంతుఁడని యగపడును.

ధైర్యధర:— అది బొత్తిగఁ గాదు. నేను బీదవాఁడ నేను. ఆజన్మ మింతేరీతిగఁ బేదవానిగ నుండెదను. ఇదియనాయిచ్ఛ. "ఇరువదైదులక్షల జహాగీరు నాకు లభించెను. మఱియు పీతాంబరవస్త్రములు నా శరీరమలంకరించెను. ఇంతవిభవముగల శ్రీమంతత్వమను సుఖసాధన చక్రములో నేను జిక్కితిని" ఇటు నీవు తెలియకుము. శ్రీమంతత్వము నేను స్వీకరించినది శ్రీమంతులు పనిసేయువారుగ నుండవలెననియుఁ బనికి విలాసములోఁబడి పోరునటులఁ జేయుటకును మంచిపను లొనరింపఁజేయుటకును నిచ్ఛయించితిని.

భామిని:— ప్రతియొక శ్రీమంతపురుషుఁడును శ్రీమంతత్వ ప్రారంభమునఁ బలుమాఱు లిటేరీతిగఁ బలుకుచుందురు. కొన్ని దినములకా శ్రీమంతత్వమును గుర్తించినపిదప, నితర శ్రీమంతుల సహవాసము హితాహితాశ్రయములందయి, రెట్టివారును గర్తవ్యకార్యములు వదలి నిజముగ శ్రీమంతుని దుర్గుణముల నాశ్రయింతురు. తమకిపుడా శ్రీమంతత్వము వ్యర్థమైనది. ఇది నూతన శ్రీమంతత్వ లక్షణము.

ఉ. నీరధిఁ ద్రోచె భర్తనదె నీరజమందిర కాదె? విశ్వస
ద్వారిజనేత్ర భర్తముఖవారిజపఙ్క్తిని నాట్యమాడెఁగా?
మారవిరోధిమస్తకము మానక త్రొక్కెనుగాదె గంగ? యా
తీరున, లక్ష్మి పూరుషులఁ దీవ్రగతిన్ వలక్రిందఁ జేసెడిన్

ధైర్యధర:— వనమాలా! నీవుపలుకునది యబద్ధముగాదు. అయిన జాగ్రతగల బీదవాఁడు శ్రీమంతుఁడైనచో శ్రీమంతత్వమంతగఁ బాటింపఁడు. పనికిమాలిన శ్రీమంతులు దుర్వ్యసనములందు శాశ్వతముగఁ బడియుండుటాగున వారు చెడుదురు. స్వతః శ్రీమంతుఁడైనవాఁడు పనికిమాలిన శ్రీమంతుల వైభవగర్వమడఁపఁ జూడవలెను. దుర్జనుల శ్రీమంతత్వము రోగముపైన సుజనుల శ్రీమంతత్వము తప్ప రెండవమాత్ర యౌషధమట్టునకు నుండదు. శ్రీమంతత్వమను ముంటిని శ్రీమంతులే తీయవలెను. శ్రీమంతత్వమను బలమైనసూత్రము దుర్జనేతరుల స్వాధీనమగువఱకు నెంతటి గొప్పకార్యమును జేయుటకురాదు. ఇటుల చేయవలెననియే యీ జహాగీరునే స్వీకరించితిని. నీవు శ్రీమంతురాలవు గావలసిన యవశ్యకత లేదు. శ్రీమంతత్వము వచ్చినపిదప నాచర్యయుఁ జెడునేమోయను భీతి నీకుగలిగినరీతిగ నాకునుగలిగినది. కార్యవశుఁడయి యీ శ్రీమంతతనము స్వీకరించినాను. ఆ సంపర్కముచే నేను మదోన్మత్తుఁడను గాను. అటులయినను వానుంచి దానిని వదలించుపని నీపైనుండును. అప్పుడే నీవు త్వరగా రాలేదని నేనెటు కోపపడితినో యీకారణమిదియేను. ఈ పగడీయును నంగరేఖయును నీవు నీ చేతులతోనే తీయునప్పుడల నామనము తృప్తిపడునని నా నిశ్చయము. వీనినిఁ దీయుము. శ్రీమంతత్వ బంధనమునుండి నన్ను ముక్తునిఁ జేయుము. (రుమాలతప్ప నితరవస్త్రములుతీసి భామిని వానిని

జెటులగానుంచును. ) పురుషులు తెచ్చికొనిన వైభవబంధము స్త్రీలిటు త్రెంచుచుండుటకదా? పురుషులకు వైభవమువచ్చినను దానిని నాడువారివశపఱచి తామున్నచో నేమియునుం జెడుగురాదు. పతితులను బవిత్రులనుజేయు నధికారము పురుషులకంటెను స్త్రీలయందు దైవము హెచ్చుగ నిడినాఁడు. వనమాలా! ఈ విభవముతుండి నేనించుక పతితుఁడై యుండినయెడల నన్నుఁ బావనునిఁజేయు సామర్థ్యము నీయందు లేదాయేమి?

భామిని:—కోపము కాదు. ఏమో విచారించితిని. మీరు నటుల నే భామినినిఁ బవిత్రురాలినిఁ జేయరాదేల?

ధైర్యధ:—అదియటుకాదు. నన్నుఁ బావనునిఁజేసి తీసికొనుపని వనదేవతదియని పూర్వమునందే నిశ్చయింపఁబడినది. వనమాలా! నేను యోగ్యుఁడను. యోగ్యుల రాజమార్గమొక్కటియె నాకుఁ దెలియును. నన్నుఁ బావనకార్యమునందు నియోగించుపని వనదేవతదిగ నున్నది. ఇతరుల పని కాదు. శ్రీమంతిని తెలుసుకొను విషయమంతయును గ్రహించి యాఁడువారు పురుషులను పవిత్రులను జేయఁగోలవలెను. భామినినిఁ బోలువారిని బవిత్రలను జేయవలెను. ఏమి ఊరుపు లెల్లఁగనిసితివియా? ఈ నా పుస్తకముపైనుండు చంద్రునిపైతము దింపుము. కానిచో, నే నే నాచేతులార దానిని దింపవలసినదిగా నుందును. అయిన......

భామిని:—దానిని దింపుపనికి నన్నేయేల నియమింపవలెను?

ధైర్యధ:—వనమాలా! ఈ నా జగము నీపైనున్నటుల నేఁ దెలిసినాను. నీ కోమలహస్తస్పర్శయయిన తఱి నేనును నీచేతులించుక స్పృశించినచోఁ గోపమేల? ఈ పరుషోక్తులేల? ముఖచంద్రశత్రువని నీచేతులార, దానిపైఁబడవలెనని కోరితిని. ఇఁక నాలస్యమేల?

భామిని:—అయిన నాచంద్రుఁడు నాకగపడినచోఁగదా నేను దానిని దింపఁగలను? నేను బలుమాఱు లాచంద్రునిఁజూడఁ బ్రయత్నించితిని. ఎటులానరించినను నది నాకగపడదు.

గీ. భూషణంబగు చంద్రవి, భూరినాకు
గోచరముగాదు ముఖసూర్య, గోళతేజ
మెల్లదిశలను వ్యాపించి కొల్లఁగొనియె
నితరవిభవమునంత నహీనమహిమ.

ధైర్యధర:—గీ. రవియు నేనైనఁ జంద్రకరంబులెటుల
పిచ్చివానిఁగ నను జేసి పీచమడఁచె
గగనతలమున సాధింపఁగనని పనిని
చంద్రుఁడీభువి సాధించె సాహసమున.

నీ ముఖసదనమునఁదప్ప నితరస్థలములం దాచంద్రుఁడెటు నిలువఁగలఁడు? అకారణముగ నీతో నే ద్వేషించుచుండుదును నిజము. ఇదియనిజము, నీ చేతులతో నే చంద్రుని నామస్తకమున పైనుండి తీయఁజూడుము. నిజమటులనే నేనారీతిఁ జలముఁబట్టి కూర్చుండెద.

భామిని:—( స్వగతము ) ఆ చంద్రుని నెన్నిమాఱులు మోముఁజూచినను నామోహము హెచ్చుచున్నది. నాచేతులతో నే దానిని దూరముఁద్రోయ నేనెపుడును యత్నింపను.

ధైర్యధ:—ఏమీ! నాహారమీరమక్కై నను సాగనియ్యవా?

భామిని:—( స్వగతము ) ఇప్పుడేమసేయుదును? ( ప్రకాశము ) మహారాజా!

మ. శశిసూర్యప్రభ లెల్లదిక్కులను శశ్వత్కాంతితో నిండఁగా
వశమే గానఁగ వానినిన్! వనితకున్? బాటింపవేదీనినిన్?
శశిసూర్యప్రభ లుండు మీపద సరోజంబుల్ హృదిన్ గాంచి నా,
కుశలత్వమ్మున సేవఁజేయుదును మీకున్; యోధవీరాగ్రణీ.

(ధైర్యధరుని ముచ్చెలుఁ దుడుచుచు నిలిచియుండును. )

ధైర్యధ:—వనమాలా! ఇదియేమిపని? ఏమే! ధర్మసాధనకునైనా పురుషార్థస్వాతీనమెల్ల నీయందు వేగమే యుంపఁదలంచినాను, ప్రేమసత్వమున నాశరీరముపై నధికారమునదప మొదటనే యారంభించితివి. ఇప్పుడీసేవయేమి? వలదు వనమాలా! వలదు ఇటు నాసేవఁజేయవలదు. నాకంతటి యోగ్యత లేదు.

గీ. సహజప్రేమాతిశయశక్తి సాధనమున
నన్నుఁగెల్చితివీవు నీమన్ననలకుఁ
బాత్రుఁడను నేను దాసుఁడై పాదసేవఁ
జేయ సెలవిమ్ము నాకు నో చెలువమిన్న.

( పరదాలో ) వనమాలా! ఏమేవనమాలా! వసంతవోత్సవమునకుఁ బిలువ నీ గ్రామజనులు మహారాజుగారి దర్శనమునకునై వచ్చినారు ఈవార్త మహారాజుగారికి విన్నవింపుము.

భామిని:—వారెవరో వచ్చినవారు నేఁ జూడనిమ్ము. ( వెళ్లును )

ధైర్యధ:—వసంతోత్సవ మిషఁదప్ప, నితరకార్యములను గణించి యొకరీసమయమున వచ్చియుండినను వారిముఖముఁ జూచుచుండ లేను. వనమాలా! నీకేల శ్రమఁదీనికోరెదవు? ఎవరువచ్చినారో నేనే చూచెద. ( వెళ్లును. )

## తృతీయరంగము.

### ధైర్యధర శిబిరము

### ధైర్యధర - విలాసధర - లక్ష్మీధరులు

లక్ష్మీ:—(స్వగత) సేనాపతితో, నేమాటలాడునప్పుడు శుద్ధమూర్ఖునిబలె నేమేమో మాటలాడుచు ముఖ్యమగు సంగతినిఁ దెలుప, నేమఱచితిని. విలాసధరుఁడెంతయో నాకు నేర్పెను. అదియంతయును బోరగిల్లిన కడవపైనీరాయెను. ఇప్పుడన్నియును జ్ఞప్తికివచ్చెను. భామినిపై నాకుఁ గల విరోధముఁ దీర్చికొనుటకైవానికి నేనది చెప్పక తప్పదు. « వనమాలను బోలుబీదదాని నడవడికసైత మటులనే యుండును. కావుననీవు జాగ్రత్తగనుండుము పేదవానిబిడ్డ శీలమునఁ గుశీలత వహించును. ఇది శ్రీమంతుఁడగు వానికిఁ దెలియునని” చెప్పవలసినదిగ నుండెను. ఎందుకు నావండ్లుపట్టికొని పోయెను? ఆవిలాసధరుఁడీకను వానితో నేల గుసగుసలాడు

యుందును? మంచిది. వారిరువురిఁకను భవనములోఁ గూర్చుండి మాటలాడుచు నిలిచినారు. వారియిచ్ఛ యటులనే నిలిచియుండవలెనని కాఁబోలు. అటులనిలుచుట నాప్రాణాంతికమేను. శ్రీమంతుల మగుమేము, దినదినము, గడియగడియయుం, మెత్తలపైఁబరుండి పొర్లాడుచుండ వలెను. గాని కాళ్లుముడిచి రెండుకాళ్లను గంభములబలెఁజేసి దానిపై శరీరము నిలుపవలెనా? ఇదిబహుశ్రమ కూలిపనిచేయు వారింబలెఁ బనిఁజేయను దరిద్రులుగా వించికొనిన యుక్తి యిది. నాకిదియెంత మాత్రముమంచిదని తోఁపదు. వారింతప్రొద్దైనను నిలిచియున్నారే యదియెటులు? సృష్టికాలమున, విధాతనయనములు మూసినపుడు, దారిద్ర్యదేవత వానిశిరములో దూరకున్న జన్మమెత్తినప్పటినుండి మమ్ము నెటులఁ బడిపొర్లుచుండు లాగొనరించెనో, యటులనే యెల్లకాలము నందఱుఁబడి పొర్లుచుండ వలెనని నియమించి పంపుచుండెను. ఈదిక్కునుండి యాదిక్కునకుఁ బొర్లుట, కొన్ని వేళల వీపుపైఁబరుండుట, హెచ్చయినచో బోరప్రాకుట, కొన్నిసమయములలో మోకాళ్లపైనడచుట యివియన్నియు సరియేను. అదిక్కున కీదిక్కునకుఁ బోవు బాధ శ్రీమంతులెటు సహింతురు? ఈరీతిగ నిలువ వలెనను విషయము వచ్చినచో. సృష్టినిర్మాణ కర్తయగు దైవము శ్రీమంతుల యనుకూలాననుకూలములు యోచింపలేదని చెప్పదగినదిగ నున్నది. ఇదిసృష్టికాలములోనే వానిధ్యానములో రాఁదగినదిగ నుండెను. నాశారీరమాంసము వెన్నముద్దవలె మెత్తగనున్నది. ఇదిమంచిదేను. అయిన నీయెముక లేలయింతకఠినములుగ నుండవలెను? లోనుండి యెంతగఁ గుచ్చుచున్నవి! దైవమా! నాయెముక లొలిచినయరటి పండువలెఁ జేసియుండినయెడల నీపనిజరుగుచుండ లేదే? లోనుండి యీయస్థి ఖండములు పైనుండెడు తోళ్లగుండ నాయంగమెల్లఁ బొడుచుచున్నవి. దేవా! ఈవజ్రములు పూలవలెఁ గోమలముల సేలఁజేయనైతివి. శ్రీమంతులయంగములందంటి యుండుపలుచనిసూనె రూపము బంగరునసేల జేయనైతివి. ఈచిత్తరుమెత్త క్రిందిభూమి, ముచ్చెలలోన సైతము నా పాదములకు నొత్తుచున్నవి. దైవమా: ఈభూమిని తాళ్లతోను మట్టితోను, జేయుమని నీకుఁజెప్పిన వారెవరు? తారామండల నిర్మాణకారణమున దైవముసైతము సర్వశ్రీమంతుల ధనవ్యయమొనరించి పిదపనీపృథ్వీ నిర్మాణకార్యమపుడు నిజముగ బికారియైయుండెనని తోఁచెడు. దరిద్రదేవుఁడుతప్ప భారముగలతాళ్లను మట్టిలమట్టియు భూదేవి యురముపైమోపువాఁడెవఁడు? అంతటిశ్రమ కెవరోర్తురు? దేవా! నను బోలెడినొక శ్రీమంతుని, నించుకనీవావేళ నీగురువుగఁ జేసికొనియుండినచో, రెండు రెండు, నాలుగు నాల్గు, మూరలపొడువుఁ గలిగినట్టియు చక్కఁగనేకి మెత్తఁబడిన పట్టుతోనైనను, దూదితోనైనను నీపృథ్విని నిర్మించియుండులాగు బోధించుచుంటిని, శ్రీమంతులకు బాగుగనుండెను. ఇదినీకుఁదోఁపకున్న నేర్చికొనఁగూడదయి యుండెనా? దేవునిసర్వాపరాధములు నిపుడిపుడు మేమిందు కించుక మాయిండ్లలోఁ జిక్కఁబెట్టుచున్నాము. ఈధైర్యధరుని దర్శనమునకు వచ్చినపుడు దరిద్రునిబలెనే నడచుకొన వలసినదిగ నున్నది. ఇచటఁబడి పొర్లుచుండెద. శ్రీమంతుల నడవడికలెటు లుండునోయనునది యిపుడైనవాఁడు నేర్చికొవనిమ్ము. ( కూర్చుని కాళ్లవెడల్పుగఁ జాచికొనును ) ఇపుడుకొంచము మేలాయెను. ఎంతప్రా

దైనము వారటులనేనిలిచి యుండని. అటులనేమాటలాడుచు నెంతకాలమైనను నిలిచి యుండని.

(విలాసధరధైర్యధరులు వత్తురు)

ఇంకను నెంతకాలము నిలిచిమాటలాడవలసిన యుండిరి? కొంచెము పొద్దెక్కినది. అపుడేవచ్చిరి. ఇచట సేవకులు సైతములేరు. ఎవరు కేలూత యిచ్చి నిలువఁ జేయుదురు. [లేవ సాగును.]

విలాస:— ఏమండీ! పొర్లెదరు? [చేయియిచ్చి లేపును]

లక్ష్మీధర:— ఏమివలదు. మొదట సేనాధిపతిగారికి విన్నవించికొను సంగతి మఱచితిని. అది జ్ఞప్తికి వచ్చెను. మఱలనది పోనటుల చేతులు కాళ్లుఁ బట్టికొని యిటు నిలిచినాను.

విలాస:— ఇది నిజము. నీవు విన్నవమను విషయము మఱచినావు కదా! వీరి దినయొక విఘ్నస్థితియున్నది.

ధైర్యధర:— బాగున్నది. మఱచిన నేమాయెను?

లక్ష్మీధర:— మీరిచట సకుటుంబ సపరివారముగనున్న వారని నాజనులు పలికిరి. కావున వదినెగారిని, మా గ్రామసమీపమున వగువసంతోత్సవ దర్శనమునకుఁ బిలుచ నేరీతి రావలయునో కదా? నాకు లగ్నము కాలేదు. సేనాపతి గారిచటనే నిలుచునెడల విలాసధరు గారిని నడిగికొని వారి రాణిగారినిఁ బిలువఁ బంపెదను.

ధైర్యధర:— అటులేమియువలదు.

లక్ష్మీధర:— మా గ్రామమునకుఁ జేరు రెండుదినములకు మున్ను సేనాధిపతి గారిని మఱల దర్శించెద. అపుడు తాము చెప్పినరీతిగ వదినెగారి నాహ్వానించు వ్యవస్థ చేయుదు.

ధైర్యధర:— వ్యవస్థయేమియును జేయవలదు. అటులేమియును లేదు. మీరనలెనె నాకును లగ్నము కాలేదు.

విలాస:— అనఁగా.

లక్ష్మీ:— అనఁగా. అయిన వారెవరు?

విలాస:— అయినవారెవరు?

లక్ష్మీ:— ఆయినవారెవరు? నాతోనందఱుఁ జెప్పిరి కదా.

ధైర్యధర:— [స్వగత] ఏమి చేయుదును? లోకులకీజోలి యేల? ఎవరు చెప్పిరి?

విలాస:— అయినవారెవరు?

ధైర్యధ.— ఎవరు? మఱలనేమి? మీరేమి సేయుదురు? విలాసధరుగారూ ఆమాటల నిజము కొంత కాలములోనే యగును. పిదప మీకు సర్వమును దెలిపెదను.

లక్ష్మీ:— తెలుపఁదగినదేమియును లేదు. తెలిసెను. నాకుఁ దెలిసెను. సేనాపతిగారూ! ఆసమయమున నేను నిజముగ నానందించెదను. మహారాజు గారిరువదైదులక్షల జహాగీరునిచ్చి తమ్ము శ్రీమంతుల వర్గములోఁ జేర్చిన వెంటనె, యూగర్భశ్రీమంతులకు సైతము మార్గదర్శకులుగ నగుటకు మీ రర్హులు. ఈసహాత్మ్యాంశముతోనే తామగపడుటకుఁ బ్రారంభించితిరి, నాకు నిజముగ నానంద మగుచున్నది. తమవంటి శుద్ధకార్యధురంధరులు మాకు మార్గదర్శకులుగనుంట శ్రీమంతులెల్లరుఁ గోరఁదగినదియె. తమ దేహము శ్రీమంతుల నిజమగు లక్షణమును జూపట్టుచున్నది. ఇది నాకుఁ బూర్వమే తెలిసియుండెను. ఎప్పుడు? విలాసధరగారూ! జ్ఞప్తికి వచ్చెనా?

విలాస:— ఆ దినమునఁగదా? ఆరాత్రిగదా? ఆదొంగలు గంటువడినరాత్రి?

లక్ష్మీ:— నిజము. అదియేను. ఆరాత్రియేను, మేమును మజిలసేనాపతి గారును వనమాలి యింటి ద్వారమునఁ దప్పక యొకరి నొకరు చూచితిమి కదా? అదియనాకిపుడు ధ్యానములో వచ్చెను. శ్రీమంతుల లక్షణము సేనాపతి గారికిఁ బూర్తిగలభించెను. తమకదిగంటుపడినదని నాకాదినమున బొత్తిగఁ దెలియకపోయె.

విలాస:— కాదు సేనాధిపతిగారికి దానినుండి చెడుగేమియునులేదు.

లక్ష్మీ:— ఇది యింటటిలోను నడమనదేను. లగ్నము చింతలోఁబడక యిట్టి సంబంధము మీకుఁ గలుగుటయ సంతోషము మాట. నాకు లగ్నము కాలేదు. మీరామోదించినచో నేనే మీయింటికి కాదు నాయింటివారిని నెవరినైన నిచటికిఁ బిలువనంపెద

ధైర్యధ:— అట్టి యావశ్యకత యేమియును లేదు.

విలాస:— తమయెదుటనే యాహ్వానము సేయుటచే నామె కోపగించును. ఇంటిపెండ్లాముకంటెను నిట్టి సంబంధముగల విషయములలో మానాపమానప్రశ్నలు నిండా కఠినములుగనుండును.

లక్ష్మీధ:— ఇట్టి సంబంధవిషయములలో దిక్కులన్నియును నాకెంతగనో తెలుసును. నేను ప్రగల్భములు మీతోఁ బలుకుటకాదు. తెలిసికొనుజ్ఞానము నాకుఁ బుట్టుకతోడనే వచ్చినది. నేను స్వంతముగఁ బిలుతునా యేమి? సర్వము గుర్తించుననని తోఁచును.

ధైర్యధ:— ఈ యనికప్రసంగమేమియును వలదు. బహుశః నేను మీగ్రామమున నిలువను. మీరు శ్రమ తీసికొనవలదు.

లక్ష్మీధ:— కోపము వచ్చెను గాఁబోలు. నేనే పిలువవలెనను హఠము నాకులేదు. తమయెదుటనే యామె నాహ్వానింతును. మీరు నాగ్రామమునకు వచ్చియ తీరవలెను.

ధైర్యధ:— వలదు. ఈ ప్రసంగము వలదు. విలాసధరగారూ! నేను మీ గ్రామమునకు వచ్చెదను. వీరిగ్రామమునకు వచ్చునట్టులేదు. లక్ష్మీధరగారూ! నాకు స్పష్టముగఁ దెలుపుఁడి. మీరు వనమాలి గుఱించి యేమి పలికితిరి?

విలాస:— ఏమండీ! వారివాక్యములో నర్థమేమున్నది? ఎందఱు వనమాలినులపేర్లు వీతుంచిన పుర లోఁ జేరినవియో గుర్తింప నెటులగును?

లక్ష్మీధ:— ఏమండీ! శ్రీమంతుల దర్శనమైనతోడనె, బీదవారిబిడ్డ లడ్డపేడెములు ద్రొక్కు యమింతదూరము విచారింపనేల? మీకు స్పష్టముగఁ జెప్పునదేమియనఁగా విషయములుగూడఁ గొన్నివేళలఁ దప్పుచున్నవి. నాతండ్రిగారు నాకొక నూటాఱునిమిది ధర్మశాలలు తిరుగు వ్యభిచారులకు, పృథ్వీ ప్రదక్షిణ నాతండ్రిగారట్టి పుణ్యమార్జించిరి. నేనును శ్రీమంతుఁడుగనున్నాను. వృతనము నాకిఁకను జిక్కనికారణంబున నాతండ్రిగారికి వచ్చి ఆయిన మీరించుక నాకుఁదోడ్పడితిరేని నా తండ్రిపేరుకంటెను నాపేరు హెచ్చింపక యుండువాఁడనుగాను.

ధైర్యధ:—మీకులకర్మచర్యలు నాకు వినిపింపవలదు. విలాసధరుగారూ! వీరిని నిచటినుండి పిలిచికొని పొండి. కానిచో నేను మీగ్రామమునకు నైతమురాను.

విలాస:—వెళ్లుఁడి. సేనాపతిగారి ప్రకృతి యిపుడు బాగుగలేదు. వారినిటు చింతలోనిలుపుట యోగ్యముకాదు. మనముపోవుదము. ( వెళ్లనారంభించి లక్ష్మీధరునితో ) నేఁడుమీరు నిజముగ శ్రీమంతత్వమును జూపితిరి. ఈగుండు తప్పకదవిలెను. అతఁడు మీ గ్రామమునకు రాఁడు. అతఁడు భామినిని నిరాకరించినయెడల యది వెంటనే తనపాదములతో నడచుచు మీవద్దకువచ్చును. ( వెళ్లుదురు )

ధైర్యధ:—( స్వగతము ) ఏమి వీనిశ్రీమంతత్వము? ఏమి యీ శ్రీమంతుని వ్యర్థభాష. శ్రీమంతవృక్షమున నీరీతిఁ గుళ్లిన విషఫలము పుట్టుచు నుండినచో, శ్రీమంతవృక్షపు నీడలోనిలుచునటుల దైవమా, నన్నేలచేసితివి? దారిద్ర్యమును, దపించుతపనుని జ్వాలలో నిలిచినమాత్రన నా కేమితక్కువ సుఖములభించుచుండెనా? వనమాలినిఁబోలు నిర్మలనిష్టాప సతేజ మానసము నందతః పతన కారణ కార్యముండునా? ఉండదు. అట్టిపాపసాంబంధికా శుచి దానికినంటునా అంటదు. దానివిషయమున సంశయమునుగలుగుట నామూర్ఖ్యమేను: ఆ దుర్మార్గునిపై నాగ్రహించుటయందర్థము లేదు. నేను దైవముపైఁ గినుకవహింపవలెను, పాపప్రతాప ప్రౌఢిమను బ్రకటించు చాండాలురకు దైవమా! లక్ష్మీదేహస్పర్శ యేలకలిగించితివి? ఈ భూరిపాతకి శ్రీమంతునినేల మనిచితివి? ఇట్టి తుచ్ఛ నరపశువునకు లక్ష్మిని జూపుచు దైవమా, యీ దేవిస్నేహము వారుసేయుట నీవెటు సహించెదవు? మొదటినరకము వారికిఁజాలదని వారిని శిక్షించుటకునై, నవీననరకము కల్పింపఁజేయుము. ఇట్టి పందెమాడినపిదప దైవమా! ముందేమిసేయఁదగినది నీకు తెలిసియున్నదియా యేమి? ఉండును. తెలిసియుండును. ఊరక మముఁబోలు పేదలదిక్కునంద లక్ష్మితానై యేలవచ్చునో? ఆ పాపరాశినుండి నన్నువిడిపింప సామర్థ్యము నాభార్యకులేదు. కావున సత్వశీలయగు నీబిడ్డయయినను మాతృగమన పాతకమొనరింపఁజూచు పాతకులచేతినుండి వారితల్లిని విడిపింపవలెను. అట్టి యాక్రోశమీ మూఁడుపదకముల లక్ష్మి నావీనులలో బోధింపసాగినది. రాజధానికిఁబోయి పృథ్వీధర మహారాజుగారికి విజ్ఞప్తిచేసికొని ప్రథమమున నప్పనియచేసెద.

చ. విలయబలాతిరేకమున, బీడ్వడినట్టిధరిత్రినిన్, గృపీ
వలుఁడెటు నట్టుత్రవ్వి కడువావిరిఅప్పలతొల్లనేరి, స
త్ఫలమునునందునో యటుల భాగ్యమదాంధుల గర్వమార్చి
యీ యిలనుఁబవిత్రఁజేయ, ధరణీశునివేఁడెద నట్లొనర్చెదన్.



# మానాపమాననాటకము.

## పంచమాంకము - ప్రథమరంగము.

### శంకరమందిరము.

భామిని - ధైర్యధరు - కుసుమ - వినోద - నటులు.

భామిని:— ( స్వగతము )

చ. ఖలులకుదోషముల్ సుజనకోటికి నందతిపుణ్యముల్ ధరా
తలమునను౦డు; దోషమనద్రవ్యసమేతము; పుణ్యమన్ననో
దళితధనమ్ము దుఃఖసముదాయగృహమ్మను, నైనస్వర్గసం
కళనపథమ్ము శాశ్వతసుఖమ్మిడు సౌషధమౌ పరమ్మునన్

లక్ష్మీధరునియందు మూర్ఖతనమునకుఁ జతగఁ దుష్టతనము నిండియున్నదని నేఁ దెలియనైతిని. స్వప్నమందైనను నేఁ గననైతిని. కృపాణధారను గొంతుపై మూర్ఖతనమునను౦చిననేమి దుష్టతనమునను౦చిననేమి? కృపాణధారచే గొంతుదెగుట నిజముకదా? ఆ దినమున ధైర్యధరుగారి శవమును నధికారులసగ్గములోనుండి తీసివేయవలెనని యుండిరి. నేనడ్డపడితిని. సర్పమునకుఁ బాలుఁద్రాపినచో నది యుపకారమేరీతిఁ దీర్చునో యదేరీతిగ నా శవము నాయుపకారముఁ దీర్చికొనెను. వానిని నధికారమునుండి తొలఁగింపవలెనని పునః నాకు నిచ్ఛగలిగినది. అపుడే నెన్నటెన్నటికి వానిపై దయనుంపుమని వేఁడను.

( ధైర్యధరుఁడు వచ్చును )

ధైర్యధ:— వనమాలా! వెలుపటఁ దోఁటలో వసంతోత్సవ సంబంధమైన యుత్సవ సమారంభము హెచ్చుగ నడచుచుండును. గానము, నృత్యమును జూచుటవదలి చింతిల్లుచున్నావేల? మఱి నీమోమేల వాడువాఱుచున్నది. మోము చిన్నదయినదేల? ఏకాంతమున నేల గూర్చుంటివి? ఆ లక్ష్మీధరుఁడు నాతోనాడినమాటలు నేనూఱక నీకుఁ దెలుపవలెనని చెప్పినందులకు నేనీవు పలవరించుచుఁ గూర్చుంటివి. దీనముద్రనువహించి కంట నీరుగార్చుటయేల? ఇట్టి నిర్మలలోచనంబులయందును, నిష్పాపకాయమందునను, నిట్టి కోమలమానసమందునను నెవనికి నెప్పుడైననుగాని సంశయమువచ్చునా?

భామిని:— అయిన మీకు వచ్చియుండెనుగదా!

ధైర్యధ:— నాకు సంశయము వచ్చియుండెనా? నీకన్నిమాటలుఁ దెలుపవలెనని నీతోనంటిని ఇంతియ ఒకవేళ నటు సంశయమువచ్చినను నీయొక్క యశ్రుబిందువు వేయిసంశయములైనఁ దోఁ జేయదా? కాదు. ఆ సంబంధమున నీకిఁకఁ నొకయక్షరమైనఁ బలుకను. "నీతండ్రి నేఁడువచ్చును. అపుడీవిషయమున మీకు నిజము తెలియునని చెప్పియుంటివికదా? అదియు నాకగత్యములేదు. ఎవరేమనినను నీవీక్షణముననే నాధర్మపత్నివగుదువు. శ్రీమంతుఁడుగాని పేదవాఁడుగాని మఱియెవఁడుగాని మాటలచేతనైనను, శక్తిచేతనైనను, నాచేత

నీచేతిని దూరము సేయ శక్తుఁడను కాను. ఇదినీవు దృఢముగ నమ్ముము............

భామిని:—అయిన గర్భనిర్భర యోగ సమయమునందును దమచేతులు నాచేలంటక దూరముగనుండవలెను.

ధైర్య:—రణాంగణమున శత్రువుల పైఁబడి నప్పుడెప్పుడును నా చేతులు దూరగిలలేదుగా.

భామిని:—అపుడు మీ యర్ధాంగి మీ కేలుననుండ లేదు. కాయముననుండ లేదు. వచనమున మనమున నంగాని యుండ లేదు. అంత్రమూడక గొంటుల........( వినోద కుసుమవత్తురు ) అమ్మయమ్మ! నాయన్న వచ్చెనేమో? భాగ్యము. సమయమునకువచ్చెను. అతఁడువచ్చెనేని లక్ష్మీధరుని సంబంధవార్త......వలదు నేనె యితని చెవులో వేసెద.

ధైర్యధర:— అటుల జేయు కార్యమేమున్నది? నామనమునందించుకయైన సంశయముదయించెనఁగదా?

భామిని:— ఎందుకును గాదు. సకలమగు మాటలు నతనికిని మీకును దెలియుట మంచిదికాదా? ఏమి? ఇదియేమి? నాయన్న వీరు వెంట రాఁడాయేనేల? ఏమే పుష్పమాలా! నాయన్న యిచటికి వచ్చినాఁడు కాదా?

వినోద:—బాబా సాబుగారు వచ్చినారు. అటులనే భామినీ.....అటు కాదు. ఏమే పుష్పమాలా! మీ నాయన్నగారు వచ్చినారా యితరుల తండ్రిగారెవరయినను వచ్చినారా చెప్పఁగూడదా?

కుసుమ:— వనమాలా! మీ నాయన్న వచ్చినాఁడు.

భామిని:—మంచిదాయెను. దైవము నా చింత దూరగించెను.

ధైర్యధ:—వారేమియును దెచ్చియుండరు కదా?

కుసుమ:— వారొక్కరే రాలేదు. భామిని నాయన్నగారి వెంట వారువచ్చియున్నారు. ఈ వసంతోత్సవ సమయమునఁ దమదర్శనమును జేయవలెనని వారు దలఁచినారు.

భామిని:—నే నెంతటి యవసరమున వారిని బిలిపించిన విషయమంతెల్లఁ దెలిపితివియా పుష్పమాలా?

కుసుమ:—అవును. నేనంతయును దెలిపితిని. విలాసధరుఁడును, లక్ష్మీధరుఁడును నిచటికి నేల యెటు వచ్చియుండిరనునదియు మహారాజుగారికిని వారికిని నేమేమి మాటలు జరిగినదియు మహారాజుగారి ప్రేమాలయమున సంశయ విషమెటుగలుప వారు ప్రయత్నించినదియు నంతయును దెలిపితిని. అప్పుడు భామిని తండ్రిగారనిరి కదా! నేనే ధైర్యధరుగారి సరసకువచ్చి [illegible]మువనిత మఱియు మీభార్య యేర్పఱచి తీసిన యీ వనమాల గంగోదకమురీతిఁ బవిత్రు[illegible]లని పలికెద. ఈ రీతిగఁబలికి వారును బ్రయాణమైరి.

వ[illegible]మినిసైతము వారివెంటనె ప్రయాణమయ్యెను. సేనాపతితో నేను వివాహమాడకున్న లేదు [illegible] నాదాసిగా నుండఁబోవుదాని, నాతఁడు పెండ్లియాడును. అంతమట్టుకు నాకానంద[illegible]ను. ఇటు భామినియనెను.

కుసుమ[illegible] భామినితండ్రి వనమాలతండ్రి మీమామ సర్వులు నేఁడువచ్చుచున్నారనియును దమ[illegible]నను వచ్చుచున్నారనియును దెలుపవచ్చితిని. నేను వారినిఁ బిలిచికొని రాఁజూచితిని. [illegible]మిని సకలాభరణములు ధరించికొని శృంగారముగుటకుఁ బ్రారంభించెను.

ధైర్యధ:—[illegible]గర్వమును నీకుఁ జూపుటకునై భామిని యిచ్చకాఁబోలు. రానిమ్ము. తన సకలా[illegible]ధరించికొని రానిమ్ము. ఈ సౌందర్యమును జూచినచో సకలము వజ్రములు [illegible]డిపోవును. మఱలఁ దానికి దాసిగానగుటకునైతము తనకు యోగ్యత లేదని

తా నే తెలిసికొననిమ్ము. ఆభరణములు ధరించి యదివానిమ్ము. ఆభరణములు నైజరూప
ములు గావని శ్రీమంతు లగత్యము దెలియఁజెను.

వినోద:— బాబాసాహెబుగారు మీరననరీతిగ నేయనిరి. వనమాలినిని భామిని యొకతోళిసేయఁ గారణము
లేదని హెచ్చరించెను అప్పుడు భామిని కోపగించి పలికెనుగదా......................

భామిని:— వినోదా! ఏమిటు చేష్టలు చేసెదవు? ఆ శ్రీమంతుని ముద్దుకన్య కోపభీతిగొనుచుండుటకు నిచట నింత
గఁ బలుకుచున్నావు?

ధైర్యధ:— దానినుండి భీతియేమి? ఈ లగ్నము పనిలో శ్రీమంతులకు బొత్తిగ నవమానముగునని కోప
మున నేతోఁపిచ్చిదానిగ నటించినది. వినోదా యేమంటావు?

వినోద:— భామిని కోపమున నగలన్నియును దీసి పారవైచెను. కంఠమునందలి హారము గుండుతుంట
లోనవైచెను. కాలిసంకెలలు తీసి వేసెను.

కుసుమ:— నేను భూషణమైయున్నాను. నీవిది తీసికొనిపోయి వనమాలీదేహ మలంకరించుము, అప్పుడెవరు
సౌందర్యవతులో గాఁడనగు.

వినోద:— అప్పుడు బాబాసాహెబు చెప్పెనుగదా. శౌర్యము నేగాక లక్ష్మినిఁగూడ నిటు గర్వమునఁ
దృణీకరించుపిల్ల నేను హతము ధైర్యధరుని గొంతుకుఁ గట్టవలెనని యుంటిని, ఈ యపరా
ధమునకు బదులుగ నా ప్రేమయందు నీ సొమ్ములను నేను వనమాలికి నర్పించితినని ధైర్యధరు
గారికిఁ దెలుపుమనిరి.

కుసుమ:— అకాలగణమున బాబాసాహెబుగారు రాక పూర్వమే వనమాలికి సొమ్ములు పెట్టుటకై
నేను మొదటనే వచ్చితిని. భామిని నాగ్రహించి యీ సొమ్ములు వనమాలి ధరింపరాదని
బాబాసాహెబుగారు పలికినారు.

భామిని:— నాకు సవతికావలెనని చూచుచుండెనుగదా యాది? భామినిసొమ్ములు వేను ధరింపకున్న
నాకనడవదా? నా ముచ్చలేమి యడ్డియా?

ధైర్యధ:— శ్రీమంతులరీతిగ సౌందర్యగర్వము భామినికనున్నదేమో? చూడనిమ్ము. ఈరూపము సుందు
తనరూపమెంతయో? ఏయర్థమున దానికీ సౌందర్యగర్వమింతగఁ గలిగినదియో యాదార్థ
మునఁనే వీరిరువురి సౌందర్యమును దూచినచో వనమాలీభారము హెచ్చి తక్కెడ తలక్రిందు
లగునేమో? దానిని నీవు జూచినావుకదా? రూపముననది దీనికిఁ దులదూగునా యేమి?

భామిని.— దానిరూపమును గట్టికొని తామేమిసేయుదురు?

ధైర్యధ:— నాకు నీరూపముఁదప్ప నితరవనితల రూపమెట్టిదియునుఁజూచి చేయవలసినదేమియును లేదు.
అయిన నేను హితులనుండి వినినమాటల నిజస్థితిఁజూచి నిర్ధరింపవలెను, ఏమిరా వినోదా!
భామినీరూపమెటులున్నది. ఎందున్నది?

వినోద:— దానిదేహమునుండి యలంకారము తీసినయెడల నదియే నిజముగ వనమాలియనఁదగును. దేహ
ము నలంకరించికొనిన భామినియేను. మహారాజా! ఈ సొమ్ములచే వనమాలి నలంకరింపఁ
జేయకుము. ఎందుకనఁగా:- భూషణములు లేని భామినిని, వనమాలయని మీరు తెలిసికొని యీ
వనమాలినివదలి యా వనమాలిని వివాహమాడుదురేమో.

ధైర్యధ:— నీవింతగ వర్ణనఁజేయుచున్నావు. నల్లురాళ్ళవారిరీతిగ మాటాడుచున్నావు. ముఖ్య ముఖ్యరీతిగ

ను, కనుఁగవ కనుఁగవబోలెను, వీనులు వీనులభంగిని నుండును. పరమేశ్వరుఁడు నయనములు చేయును. వానిని వజ్రములబలె వెలయఁజేయును. ఇది చమత్కారము.

భామిని:—నాబలె భామినిరొక్క యంగాంగములెటులున్నది?

ధైర్యధ:— ఎటులైన నుండినను నుండనిమ్ము. భామినిని నెదుటఁజూచినచో నేను దృఢముగఁ బలికెదను.

భామిని:—అదియెటులు?

ధైర్యధ:— శ్రీమంతులకునొక గొప్పచింతతగలిగియుండును. అదినీకుఁదెలియదు. కావున నీవిది విచారించెదవు. శ్రీమంతులు తమవిషయమిట్లు తలఁచియుందురు. లోకులు తమయందము శ్లాఘించుచున్నారు కావున నదేరీతిగఁ దామందముఁ గలవారమని నిశ్చయించికొనియెదరు. లోకులకు శ్రీమంతులద్రవ్యమందముగనుండును. అవయవముల నటుతలంపరు. శ్రీమంతులది తెలియఁజాలరు. నేననేక శ్రీమంతులను జూచినాను, వారికించుక దారిద్ర్యవేషమును వేసి దారినూర్వ నియమించినచో నట్టిపోఁకి మోములు పదేపదేయగపడి జనులకు వమనరోగము కలుగునని యందఱు వలదబోయని వానిని విడిపింతురు, అట్టి వికారస్వభావముగల వారైనను తాము తమసౌందర్యమును లోకులుమెచ్చుచున్నారని తెలియుదురు. ఇది నా నిశ్చయము. భామినివిషయముకూడ నట్టులనేయుండును.

భామిని:—ఉండదని యెవరుచెప్పిరి?

ధైర్యధ:—దానిని బొత్తిగ నవమానించనే సొమ్ములు.

భామిని:— భామినిసొమ్ములే నెన్నటికిని ధరింపను?

ధైర్యధ:—మనమించుక రాజధానిలోనుండినచో నిట్టిసొమ్ములరాశి నీ ముంగిటఁ జేర్చుచుంటిని. భామినియును బాబాసాహుగారును నిచటికి వచ్చిచేరకమున్నే వారికంట్ల మిఱుమిట్లుగొనులాగు నీవలంకరింపఁబడవలెను. కావున బాబాసాహుగారిచటికి రాకమున్న వారిచేనంపఁబడిన సొమ్ములు నేనే నాచేతులార నీదేహముపై నలంకరించెదను. అంతయేమి.

భామిని:—ఆభామిని నాసవతియగు కారణంబున నదియిచటికి వచ్చుచున్నదని నేఁ జెప్పలేదా? సవతి సొమ్ములు ధరించి మైలపడుటనే నిచ్చయింపను.

( శీలధరుఁడువచ్చును. )

ధైర్యధ:—మంచిది. శీలధరా! ఇదియేమి నీవిపుడువచ్చితివి? సెలవు ముగియకమున్నే నీవేలవచ్చితివి?

శీలధర:— మహారాజాగారూ! సెలవుదినములలోనే నేను రాజధానికిఁబోయియుండఁ, బృథ్వీధరమహారాజుగారి దర్శనమాయెను. యుద్ధవిషయమును సేనలవిషయమున, సేనాధిపతివిషయమును మాటలాడుచుండఁగా మహారాజుగారు నన్నొకప్రశ్నయడిగిరి.

ధైర్యధ:—ఏమివిచారించిరి?

శీలధర:— సేనాపతిగారు రాజధానికి వచ్చునపుడు తమభావి భార్యతో సైతము వచ్చెదరనివింటిని. ఇది నిజమేనా? మహారాజుగారిట్టి ప్రశ్నయడుగుటచూచి నాశ్చర్యమేమియును లేదు. పిల్లలకును పెద్దలకును సర్వులకును మాటలాడు విషయమిదియైనది. వనమాలగారెవరు? ఎచ్చటివారు? ఏమిపనిజేయుచున్నారు? అను ప్రశ్నలకు బదులిడి యిడి నేను వేసరితిని. వనమాలగారెవరయి

నదియు నెచటనుండునదియుఁ బ్రథమదర్శన మెటులైనదియు నచట నేమేమి జరిగినదియు మహారాజుగారికి నేనే తెలిపితిని. తమవివాహ నిశ్చితార్థము నేనెఱుంగకమున్నే లోకవార్తలు మహారాజుగారి చెవిలోఁదూరినవి.

శైర్యధః:—నా లగ్ననిశ్చయము కాకమునుపే లోకులీవిషయమెటు లెఱింగిరి?

వినోద:— ఐదుగురినోట నీశ్వరుఁడుండును. ఆదైవము నావలెనే సర్వమును మున్ముందుగఁ దెలియుచుండును.

శీలధర:— ఈ లగ్నము నిశ్చయింపఁబడినదని విని మహారాజుగారానందపడిరి. మఱల నాతో సందేశము పంపినారు. ఏమన:—లగ్నసమారంభము రాజధానిలోఁ గావలయుననియు వనమాలగారి రాజకన్యగఁ దలంచి రాజయోగ్యమగు నలంకారములచే భూషించి కన్యాపక్షమున మహారాజుగారే యుందురనియు నేవేళలో “రాజకన్య” యను శబ్దము వెడలెనో యా సమయమునుండి రాజకన్యావర్గములో వనమాలినిగారు చేర్పఁబడిరనియు వారాన తెచ్చిరి. ఆ వైభవమునకుఁ జేరినవియు యీ యశుపులు నీ యలంకారములు. తల్లిగారికి సమర్పింపుమని మహారాజుగారు నన్నుఁ బ్రారంభముననే పంపిరి.

( వస్త్రములు సొమ్ములు నిచ్చును. )

శైర్యధ:—వనమాలీ! బాగయ్యెను. ప్రారంభమున శంకరుని సమక్షమునుగ నాదైవమును సాక్షిగనుంచికొని లగ్నము చేసికొనవలెనని శపథముఁ జేసితిని. కాదేని దేవవానిబిడ్డతో వివాహము చేసికొనుటకు బదులు రాజకన్య నా గొంతుకుఁబడేమగదా? ఇతరభామినులకంటెను రాజకన్యమే లేదు. నీకాభామిని నగలువలదుకదా? మహారాజుగారు పంపిన యీ సొమ్ములను ధరింపుము. భామినివచ్చినపుడు దాని సౌందర్యము నిస్తేజమొనరింపుము. శీలధరగారూ! దీని తండ్రిగారు నన్నుఁ జూడవలెనని వత్తురఁట. వసంతోత్సవమునకు మున్ను వారువచ్చినచో వారినిచటికిఁ బిలిచికొనిరమ్ము. రాజకన్యాలంకారమున శృంగారమగుదానికంటె నధికముగ దానితండ్రినిఁజూచి వనమాలి సంతసించును.

శీలధర:— మహారాజా పోయివత్తును. ( వెళ్లును )

శైర్యధ:—వనమాలీ! నీచెలిచే నీయలంకారములను వేయించికొనుము. ( పరదాలో మేళతాళములధ్వని )

అదెవినుము. నృత్యగానములగుచున్నవి. వసంతోత్సవమునకు మేళమగుచున్నది. ఈదిక్కునకే వచ్చుచున్నది. పొమ్ము. పుష్పమాలా! వెడలుము. ఒక్కొక్క సొమ్మును దేహమునందు వేయ, నీచెలికిఁ దోడ్పడుము పొమ్ము.

భామిని:—నా నాయన్నయింకను రాఁడాయెను. మహారాజుగారు పంపినసొమ్ములను ధరించునపేక్షకంటెను, నాయన్నను జూచునపేక్ష నాకు హెచ్చుగనున్నది. అది ప్రేమసేవ. స్వకష్టమున సంపాదింపఁబడిన యీ సొమ్ములనుఁజూచి సకలస్త్రీలు నన్ను ధన్యయని పిలుతురుకదా?

ధైర్యధ:— అమూల్యమైన యలంకారముల చుట్టును నిచ్చెలిచిల్లర భూషణముల ప్రభావళి యుంచినచో సోపానముపైన సోపానము సౌధము వలెను మబోయి చేరినచోనను బోలుపేద వారందఱు నుఁజూచి సంతసింతురు. ఇదేగనుము. బాబాసాహెబుగారు వచ్చునంతలో సర్వాలంకారములు ధరించిరమ్మా. రాజకన్యయయిన వనమాలి యొక్క దర్శనము అందఱికంటెను ముందు నాకుఁ గావలెను. ( వనమాల - పుష్పమాల - వెళ్లుదురు ) - వినోదా! కొంచెముసేపు వసంతోత్సవమును గందుమురమ్ము.

పాట:— ( పిల్లలుపాటలఁ బాడుచునటించు చుందురు )

వినోద:— మహారాజా! ఈపిల్లలు పూలతో శంకరుని సమాధి చేసి కప్పిరి. మనము మైమఱచితిమి. ఈపిల్లలీ రుద్రాలయమును ఋతుమండలమునుండి ప్రేమమందిరముగను దించిరి. బాబాసాహెబుగారు వచ్చినపిదప వనమాలీ పాణిగ్రహణము కామించుటఁ జేసినచో వసంతోత్సవ మా ప్రేమమందిరములో నయినరూపలఁ గలశమెక్కించిన రీతిగనగును. శీలధరుఁడేమి చేసినను బాబాసాహెబువారికి దొరకునని నాకుఁదోఁచుచు. తమ యాజ్ఞయయినచో, నేనుచక్కఁగ వెదకి వారినిఁ బిలిచికొని వచ్చెద.

ధైర్యధ:— ఏమోయొక వనిసైపమున, నాపిల్లలు నృత్యమాడుటఁజూడ వారివెంటఁబోవలెనని నీ యపేక్ష గాఁబోలు. పొమ్ము. వినోదా! పొమ్ము. ఈగీతిగఁజరుగు వసంతోత్సవసమయములో నీ యపేక్షకు భంగమేల కలుగవలెను? పొమ్ము. అనుభవింపుము.

వినోద:— మహారాజా! పని పోతలవ్రాఁత; సుఖానుభవము తమభాగ్యము. అదిగో యాకారమునుఁ గొని యుత్సవమే, తమదిక్కుకు వచ్చుచున్నది ( వెళ్లును. భామినీ పుష్పమాల వచ్చుచుందురు )

పుష్ప:— ఇదియేమే? వేయఁదగిన సొమ్ములింకను నిలిచినవి. ఇంతే, యవసరమా? ఆ పూలచెండు తురుములోఁ జక్కఁగఁ గూర్చుండలేదు. ఏమే కొంచెము సావకాశముగ పడవఁగూడదా? నీయవసరములోఁ గొప్పున దురిమిన పూలచెండు జారి మహారాజుగారి దేహముపైఁ బడును సుమా! ఏమిచేయుదును దీనిని?

ధైర్యధ:— పుష్పమాలా! దేవదర్శనమునకిపుడు నటించుచుఁబోయినదెవరు? ( భామినీ దేవాలయము దిక్కునఁబోవును. )

పుష్ప:— ఎవరనఁగా? సకలము నాశ్చర్యమేను! మొదట దేవదర్శనముఁజేసి పిదప మహారాజుగారి దర్శనమునకుఁ బోయెదనని యదిపలికి మహారాజుగారియెదుటనే కావలసిపోయినది. ( భామినిఁజూచి ) నిలువవే. సకలాభరణములు వేయకమున్న నిన్ను నేను దేవునియెదుటఁ బోనియ్యను. ( వెళ్లును )

ధైర్యధ:— ఇపుడు నటించుచుఁ బోయినదెవతెయుండును? వనమాలియేను. మఱియెవరుందురు? వజ్రములు, ముత్యములనఁగా, సౌందర్యముదమేను. ఇన్నిసొమ్ములచే శృంగారింపఁబడిన పిదప దానిపాదములు నటించులాగుననుండుట యాశ్చర్యమేమియునుగాదు. అయిననది వనమాలియుకదా? ఇప్పటికి భామినిపై తప్పు వచ్చునదిగనున్నది. వనమాలికంటెను తాను

సుందరియని విశేషమగు డాంబికము చూపునుగాఁబోలు. ఇట్టి టాకటీకులతో సాయాహ్నము నుండి వెళ్లినది, భామిని, కాదుగదా?

చ. చపలగతిన్ బయంబులను జారుమనోహరలీలనుంచుచున్,
నృపతికుమారియున్ బలెను నీటుగఁగుల్కుచు మోముఁద్రిప్పుచున్
స్వపదసరోజయుగ్మములపై నయనాబ్జయుగంబుఁ జేర్చుచున్
ద్విపగమనాంగలీలఁ జను దేవత నామనమున్ హరించెఁగా,

( లక్ష్మీధర విలాసధర శీలధరులు ప్రవేశింతురు. )

లక్ష్మీధ:— సేనాపతి యిచటనున్నవాఁడో నాకుఁ ద్వరగఁ జూపుము. నా దేహమంతయు నానందమున నిండిపోయినది. వారినెప్పుడు జూతునోయని నామనముత్సాహపడుచున్నది. ఏమండీ విలాసధరగారూ! వేగముగ నడువుఁడి. నావలె నింతక పరుగిడుట నేర్చికొనుఁడి.

విలాస:— ఏమండీ; ఇటు పరుగిడుచున్నారేల? ధైర్యధరుగారి దర్శనమైనతోడనే సకలసంగతులు నేను వారికి మీరు తెలిపినరీతిగ విన్నవింతును.

లక్ష్మీధ:— ఇప్పుడు నాకు ధైర్యము వచ్చెను. ఇఁక నిదానముగఁ బోవుదము.

ధైర్యధ:— శీలధరుగారూ! ఏమి బాబాసాబుగారిని బిలిచికొనిరాలేదు?

శీలధర:— నేను నలుదిక్కుల వారికొఱకు వెదకితిని. ఎచ్చటను వారు దొరకరైరి, అంతలో వీరు గనఁబడిరి.

విలాస:— కావున ననాయాసముగఁ దమదర్శనము లభించెను.

లక్ష్మీధ:— తమరిచటికివచ్చినారని వినినవెంటనే, యెప్పుడెప్పుడు తమదర్శనము లభించునోయనిపించెను. అబద్ధముకాదు. ఏమండీ! ఏమండీ! శీలధరుగారు వచించిన యొక శబ్దమువినినతోడనే మీకును మాకునుఁగల పూర్వవైరము పోయి మార్గము సరళమాయెను, వారియొక శబ్దముతోనే మాయిరువురికి సఖ్యము కుదిరెను. మైత్రి హెచ్చెను. ప్రేమజనించెను. తమకు రాజకన్య.

శీలధర:— నేనెప్పుడుఁజెప్పలేదు. రాజకన్యతోఁ దమవివాహము నిశ్చయింపఁబడినదనియు వేగముగ లగ్నసమారంభము జరుగుననియు.

లక్ష్మీధర:— ఆ మాటవినినవెంటనే నాకు నానందమయి యటులనే పరుగిడివచ్చితిని. నిట్టూర్పు వదలుచువచ్చితిని. ఏమండీ! మేము శ్రీమంతుల మింతటివేగమున నెచటనైనను నడతుమా? యుద్ధములోనైతము పరుగిడునపుడింతగ నేఁ బరుగిడను. పిడుగునుఁబోలు వేగమునఁ బరుగిడి తమదర్శనమునకు వచ్చితిని.

ధైర్యధ:— ఇంతటియవసరమునకుఁ గారణమేమి?

లక్ష్మీధ:— రాజకన్యతోఁ దమవివాహము నిశ్చయింపఁబడినది నిజముకదా?

ధైర్యధ:— అవును నిజము.

లక్ష్మీధర:— చాలును. ఇంక మీ యిరువురి మధ్యం గలిగిన కలహకారణ మెద్దియును నిలువలేదు. ఉత్త రాధిపతితో నెటు మీరు కట్టుబాటొనరించితిరో యటులనే నాతో నున్న భామినీసంబంధ ములో నట్టి యేర్పాటొనరింపవలెను. అట్టి యేర్పాటు కావలయునని నే నొంటికాలుపై సిద్ధముగనున్నాను.

ధైర్యధ:— మీ రేమి చెప్పందలంచినదియు నాకు స్పష్టముగం దెలుపుండి. తమరు రలసి యూపిరివిడుచు చున్నారు. కొంచెమిచటం గూర్చుండుండి. పిదప స్పష్టముగం దెలుపుండి.

లక్ష్మీధర:— నిజము. నేనుగూర్చుండుట మఱచిపోయియుంటిని. ( కూర్చుని ) విలాసధరుగారూ! నే నించుక విశ్రమించెద. తామే సేనాధిపతిగారితో నా మనవిని విన్నవింపుండి.

విలాస:— తమవివాహము రాజకన్యతో నిశ్చయింపంబడినది. దీనినిగని యందఱును నానందపడుచున్న సహజమేమి. అందఱిలోను లక్ష్మీధరుగారికి విశేషానందమైనది. దానికారణమేమన, వారు భామినిని వివాహమాడవలెనని మనమున నపేక్షించినారు. తమమూలకముగ యూలగ్న మిన్నిదినములవఱకు నిశ్చయము గాక నిలిచియుండెను.

ధైర్యధ:— నామూలకమున నదంగ నేమి?

లక్ష్మీ:— ఏమనంగా? ఏమండీ! బాబాసాబుగారి మనమునం, భామినినిం దమకియ్యవలెనని యుండి నది. భామినిసైతము మిమ్మే పెండ్లి యాడనెంచెను. ఇంకనన్ను విచారించు వాడెవరు? నా దారినిం బడిన మీ ముల్లును దొలంగింప నానావిధములగు నష్టములం బడ్డితిని, శ్రీమంతుల యుబ్బ ద్దములు నెవరిచేతను గనిపెట్ట శక్యమగునా. దీనికింగానే, మాకును మీకును విరుద్ధము గలిగెను, ఇపుడానందమాయెను. సేనాపతిగారూ: ఇది వినుండి. నాకు భామిని కావలెను. బాబాసాబు గారివద్దజూచి భామినిని లక్ష్మీధరుగారికి నియ్యుండని మీరు చెప్పితిరేని, మాకును మీకును స్నే హము నిలుచును. రాజకన్యకైనే రాజుగారు తమవివాహమునకు నెంతద్రవ్యము సెలవుచేయు దురో యంతకంటె నధికముగ నామిత్రులయెదుట నేను వ్యయము చేయుచున్న. భామిని యును నేనును గూడి తమలగ్నములో నాందీపీటలపైం గూర్చుందుము.

విలాస:— నవీన దేవాలయము నిర్మించిన వచ్చునంతటి పుణ్యము జీర్ణోద్ధారణ ముచేం గల్గుచున్నది. రాజక న్యను వివాహమాడి, నూతనగృహమొకటి మీరుం స్థాపించునటుల వీరు భామినితోం బరిణ యమాడినచో నొక జీర్ణమగు నింటితనమును భద్రముగ నిలిపినటులయి, తమకు శ్రేయస్సు కలుగును.

లక్ష్మీ:— (లేచి) ఇంతటినుండి నేనెప్పుడేగాని యీరీతిగం గూర్చుండను. ఈనాపనికి నుత్తమ శకున మగుచున్నది. అదిగో చూడుండి, బాబాసాబుగారీ దిక్కుననే వచ్చుచున్నారు, " శుభస్య శీఘ్రము " మ్మనియున్నది. తామిపుడే నాకుంగాను భామినీ విషయము మాట్లుడువారి రొమ్ము టనెత్తుండి.

2-వ ( బాబాసాబు - వినోద - ప్రవేశింతురు.)

వినోద:— మహారాజా! బాబాసాబుగారు వచ్చినారు.

భాబా:— ప్రవరనఁగాక ఇదియేమిచెప్పినది ( వ్రేలితోఁజూపును. )

శ్రీధర:— ఏమీ: రాజకన్యయగునీమె యథార్థము చెప్పెనా?

ధైర్యధ:— ఏమీ: ఈజ్ఞానవనముల మీతోనిటు కుచేష్టలొనరించెనా?

భాబా:— ఔనా భామినిచరిత నాకారీతిఁ దెలిపెను.

భామిని:— నిజము. నేనేచెప్పితిని. ఈ భామినియెన్నటికి నబద్ధమాడదు:

ఉ. రమణః పద్మంబులందు నపరాధము నేనెనర్చియుంటి దాన, నీ
రమణినిఁ గాఁగనే బడినదాయిదు లెన్నియో, యమంత్యమంతు నీ
క్కముగను జీవదానమయి కంటిని నీదయ, భాగ్యగర్వ, మం
త్యముఁగనె నీదుప్రేమాల, శుభదాయక, ధర్మమునేను భామినిన్.

ధైర్యధ:— నిజము. బాబాసాహెబుగారూ! ఇదిపలికిన దెన్నటికి నబద్ధముగాదు. శ్రీమంతజన్మమంది, శ్రీమత్తత్వమునఁ జెలఁగి, యదృష్టాచరణచే సర్వులను. నేర్పుటకునై యీసద్గుణమంజరి, లక్ష్మీదేవి యంశమున మంగళదాయక రూపమున ప్రత్యక్షమై యీ భామినిగను నావనమాలిగ్నయా పాణిగ్రహణమొనరింపఁ జూచినది. దానికినే నుత్సుకుఁడనై సిద్ధపడితిని.

బాబా:— నాభామిని కళ్యాణానందమున మీకరములందిడెదను. [ అనుఘనటు లొనరించును ]
ఇదిపాణిగ్రహణము. మహారాజుగారి యానతిచేతి లగ్నోత్సవము రాజధానియందు నత్యద్భుతోత్సవమున జరుపుదము. ఈశుభలగ్నమున దైవముశుభము లిడుఁగాతమని ప్రార్థింతము.

( మహారాష్ట్ర పుస్తకములో లేక క్రొత్తగ జేర్చినది. )

లక్ష్మీ:— విలాసధరుగారూ! వచ్చినపని వాకిటిలోనే యయ్యెను. మాయెత్తుగడ లన్నియును నష్టమనే కత్తిరింపఁబడెను. మనమన్నాగములన్నియును సన్నగిల్లెను. మేమొనరించిన కర్మములన్నియును బూడిదలోని హోమమయ్యెను. అయ్యో, నాయెదుటనే, నాకంటియెదుటనే, నా భామినిని నాసర్వప్రాణములది యనినమ్మిన భామినిని వాఁడీడ్చికొని పోవుచున్నవాఁడే? నాకుఁగాళ్లాడవు, పదములు లేయవు, శరీరముభారమాయెను. సొమ్ములంతకంటెను భారమాయెను. నాశ్రీమంతత్వము పోయెను. [ అనుచుఁగ్రింద బొర్లును ]

విలాస:— లక్ష్మీధరుగారూ! ఇటుచేయవలదు, నగుఁబాటగును. ఈభామిని లేకపోయిన మఱియొక భామిని ప్రపంచమున లేదా? నేనెచటనైనను దెచ్చిమీకుఁ బరిణయంబొనరించెద. లెయ్యుఁడి.

లక్ష్మీ:— ప్రపంచమున నింకను భామినులున్నవారా? అటులయినపరి. ఈభామినీ లగ్నముననే యొక్క భామినీలగ్నము నాతోఁగావలయును. అటులైనదీనిపై నాకుఁగల వైరముతీరును.

విలాస:— అటులనే కానిద్దము. (వెళ్లుదురు)

( శంకరాలయములోఁ బ్రార్థన )

[ సమాప్తము ]